శ్రీరస్తు.

శ్రీమహాగణపతయేనమః.

# భరతకల్పలతామంజరీ.

## అథపూర్వరంగప్రారంభః.

---(*)---

శ్లో॥ వాగీశాద్యాస్సుమనసస్సర్వార్థానాముపక్రమే।యం
న్నత్వాకృతకృత్యాస్స్యుస్తంనమామిగజాననం॥
విఘ్నానాంశమనంకర్తుంభూతప్రోచ్చాటనాయచ।
రంగభూశుద్ధిభూత్యైవపాత్రసంరక్షణాయచ॥
ఆచార్యశిక్షాసిద్ధ్యర్థంపూర్వరంగంకరోమ్యహం॥

౨ టీ॥ విఘ్నములయొక్క-శమనంగొరకై - భూతంబులయొక్క-
యుచ్చాటనగొరకై - రంగభూమియొక్క-శుద్ధ్యతిశయంగొరకై - న
టీసంరక్షణగొరకై - విద్యాచార్యులశిక్షాసిద్ధిగొరకై - పూర్వ
రంగమును జేస్తున్నాను. ... ... ...

శ్లో॥ నిర్యద్రేణుపరంపరాపరిమళవ్యాలోలభృంగాంగ
నాఝంకారైకమనోహరంసుమశరంసంధాయసం
మ్మోహనం। కర్షంతీమదమైక్షవంధనురిమామా
పక్వబింబాధరామంబామంబురుహాసనాది భజనా
రంభామహంభావయే॥

టీ॥ జైటవస్తునుండెడి పరాగంబుయొక్క- పరంపరాసంబం
ధంబైనపరిమళంబునందు సంచరిస్తునుండెడి - భ్రమరాంగనయొ
క్క-ఝంకారంబె - ముఖ్యమనోహరంబుగాగల - మోహకర



నపుష్పశరంబును - సంధానంబును జేసి - ఇక్షుసంబంధియగు - ధ
నుస్సును- ఆకర్షణమును జేస్తునుండెడి - పక్వంబైన- బింబఫల
ముజోప్పునయుండెడి - అధరముగల బ్రహ్మాదులుండు మదులగు
వారిచే - జేయబడుతునుండెడి భజనయొక్క- ప్రారంభముగల-
నామనస్సుయందునర్తనజేస్తుంనుండెడి - అంబాదెవియను- నేను
భావనజేస్తున్నాను. ... ... ... *

రంగాధిదేవతాప్రార్థన

శ్లో॥ నఖచితశశిరేఖానమ్రమందారశాఖా మణిముకురకపోలా
మంజుళానేకలీలా ॥ కరధృతశుభవీణా కామరక్షాప్రవీణా కలయ
తుమణిసీవి కాపిరంగాధిదేవీ॥ ... ... *

టీ॥ నఖంబులచే- జయింపబడ్డ- చంద్రరేఖగల- నమ్రులగుభక్తు
లకు- మందారశాఖాప్రాయురాలగు - మణిమకురంబు వంటి- క
పోలంబుగల- మనోహరంబులగు- యనేకవిలాసంబుగల- హస్తం
బులచే- ధరింపబడిన- శుభకరంబైనవీణగల- భక్తులయొక్క- యభీ
ష్టంబును- యిచ్చేడి- యందు- సమర్థురాలగుమణిఖచితంబైన - కటి
వలయంబుగల- వాగ్విషయంబుగాకయుండెడి-రంగాధిదేవతయు-
నాకుయభీష్టంబును- యివ్వవలెనని తాత్పర్యము. *

శ్లో॥ భరతకులభాగ్యకలికేభావరసానందభూషితాపాంగే ।
జగదేకమోహనకరేజయజయరంగాధిదేవతేదేవీ॥ *

టీ॥ భరతకులంబునకు- భాగ్యకళికాప్రాయురాలగు- భావర
సయానందములుచే- యలంకరింపబడ్డ- కటాక్షంబుగల- జగంబుల
యందు- జనైకమోహనంబును - జేయుచున్నండెడి- యోరంగా
ధి- దేవతా- సర్వోత్కృష్టురాలైయుండు- ... *

నాట్యోత్పత్తిలక్షణమ్.

శ్లో॥ ఋగ్యజుస్సామవెదేభ్యో వేదాచ్చాథర్వణాత్క్రమాత్ ।

వాద్యంచాభినయంగీతంరసాంస్సంగృహ్యాపద్మభూః॥
వ్యరీరచచ్ఛాస్త్రమిదం ధర్మకామార్థమోక్షదం। యుక్తిప్ర
గల్భసౌభాగ్య వైదగ్ధ్యానాంప్రవర్ధనం॥
ఔదార్యస్థైర్యధైర్యాణాం విలాసస్యచకారణం। దుఃఖా
ర్తిశోకనిర్వేద ఖేదవిచ్ఛేదసాధనం॥
అపిబ్రహ్మపరానందాదిదమప్యధికంభవేత్। నకించిద్వర్త్య
తేలోకే దృశ్య శ్రావ్యమతఃపరం॥

టీ॥ పూర్వమునందు - బ్రహ్మదేవుండు - ఋగ్యజుస్సామవేదములవల్ల- అధర్వణవేదమువల్లను- క్రమమున- ఋగ్వేదంబువల్ల- వాద్యమును- యజుర్వేదంబువల్ల- అభినయమును- సామవేదంబువల్ల- గానమును- అధర్వణవేదంబువల్ల - శృంగారాదిరసంబులను- యీరీతున- సంగ్రహించ్చి- లోకోపకారార్థమొనర్చను - యీశాస్త్రము- ధర్మకామార్థమోక్షప్రదంబుగాక - యుక్తియు- ప్రౌఢిమ- సుభగత్వము- వైదగ్ధ్యము - వీట్లకు- వృద్ధికరంబైయుండును - మరియు- దఃఖము- మనోవ్యథా- శోకము- నిర్వేదము - ఖేదము- వీట్లకుపరిహారకంబైయుండును- గనుక- బ్రహ్మానందముగంటే- యీశాస్త్రంబు- యధికంబైన-యానందకరంబైయుండును- దీనిగంటే- లోకంబులయందు- జూచుటకు- వినుటకు- యోగ్యంబైనది- యేవిలేదనితాత్పర్యము. ... ... ... *

యీశాస్త్రప్రతిపాదితంబైననాట్యభేదలక్షణమ్.

శ్లో॥ నాట్యంనృత్తంనృత్యమితి మునిభిఃపరికీర్తితం॥

టీ॥ నాట్యమనియు - నృత్తమనియు నృత్యమనియు- నారదాదిఋషులచే-నాట్యశాస్త్రముయని-త్రివిధంబుగాజెప్పబడియున్నది.

శ్లో॥ నాట్యంతన్నాటకేష్వేవ యోజ్యంపూర్వకథాయుతం॥

టీ॥ నాట్యమనగా - నాటకాదులయందు- పూర్వమందుజెప్పబడిన- కథతో- గూడియుండేది- నాట్యమనబడును.



శ్లో॥ రసభావవిహీనంతు నృత్తమిత్యభిధీయతే॥

టీ॥ రసభావంబులచే-రహితం - తాళలయానుగుణ్యమైనది-నృత్తమనబడును- ... ... ...

శ్లో॥ రసభావవ్యంజకాదియుతంనృత్యమితీర్యతే॥

టీ॥ రసము భావము- వీట్లవ్యంజకాదులచే- యుక్తంబైనది- నృత్యమనబడును- .. ... ... *

శ్లో॥ ఏతత్త్రియంద్విధాభిన్నంలాస్యంతాండవసంజ్ఞికం।

టీ॥ పూర్వంజెప్పబడిన-నాట్యనృత్తనృత్యములు-మూడును- పిమ్మట- లాస్యమనియు-తాండవమనియు - రెండువిధములగావిభజింపబడియుండును- ... ... ... *

శ్లో॥ సుకుమారంతుతల్లాస్యముద్ధాన్తంతాండవంవిదుః॥

టీ॥ కూస్చండి- సుకుమారమగునట్టు-రసభావంబులను- యభినయించినది-లాస్యమనబడును- నిలువబడిరసభావంబులను - యభినయించినది-తాండవంబనబడును-

శ్లో॥ ద్రష్టవ్యేనాట్యనృత్యేచసర్వకాలేపిశేవతః॥

టీ॥ నాట్యనృత్యముల- రెండును- సమస్తకాలంబుల యందు- జూచుటకుయోగ్యంబులైయుండును. ... ... *

శ్లో॥ నృత్తంతత్రనరేంద్రాణామభిషేకేమహోత్సవే।
యాత్రాయాందేవయాత్రాయాంవివాహేప్రియసంగమే॥
నగరాణామగారాణాంప్రవేశేపుత్రజన్మని।
శుభార్థిభిఃప్రయోక్తవ్యంమాంగల్యంసర్వకర్మసు॥

టీ॥ పూర్వోక్తంబులైన. నాట్యనృత్య- నృత్తంబులయందు-నృత్తము- రాజులయొక్క- పట్టాభిషేకసమయములయందును- వివాహంబుమొదలైన- యుత్సవకాలంబులయందును- దేవయాత్రలయం

దును- మిత్రలుగూడినసమయమందును-పట్టణప్రవేశకాలంబులందును-నూతనగృహప్రవేశకాలములందును పుత్రజననకాలమందును-శుభేచ్ఛగలవారిచే- మాంగల్యప్రదంబగు- నృత్తము-ప్రయోగించుటకు-యోగ్యంబని-చెప్పబడియున్నది-

యీనాట్యవేదంబు-భూలోకమునకువచ్చినక్రమము-

శ్లో॥ నాట్యంనృత్తంచనర్తంచత్రిధైవోదితనర్తనం॥
నాట్యవేదందదౌపూర్వంభరతాయచతుర్ముఖః॥
తతశ్చభరతస్సార్ధంగంధర్వాప్సరసాంగణైః।
నాట్యంనృత్యంతథానృత్తమగ్రేశంభోఃప్రయుక్తవాన్॥
ప్రయోగంమృదుతత్స్మృత్వాస్వప్రయుక్తంతతోహరః॥
తండునాచగణాగ్రణ్యాభరతాయవ్యదీదిశత్।
ఋష్వాతుతాండవంతండోమర్త్యేభ్యోమునయోవదన్
పార్వత్యాత్వనుశిష్టాచలాస్యంబాణాత్మజాఉషా॥
తయాద్వారవతీగోప్యస్తాభిస్సౌరాష్ట్రయోషితః।
తాభిస్తుశిక్షితానార్యో నానాజనపదాశ్రితాః॥
ఏవంపరంపరాప్రాప్తమేతల్లోకేప్రతిష్ఠితం॥

టీ॥ నర్తనరూపకంబయిన - నాట్యవేదము నాట్యమనియు-నృత్యమనియు-నృత్తమనియు- మూడువిధంబులుగా- బుట్టుచున్నది. యని- అదెట్లనిన- ఆచార్యభరతులుకొరకు - బ్రహ్మదేవుండు- బ్రహ్మానందముకంటె- యధికంబైన-యానందమును- యిచ్చెడువంటిది-గనుక-నుపదేశించెను- నంతరంబు- భరతాచార్యుండు- గంధర్వులు- యప్సరస్సులు-వీరులసమూహంబుతోడ - యీనాట్య-నృత్య-నృత్తములు -పరమేశ్వరునియొక్క - పురోభాగంబునందు- ప్రకమించెను - నంతరంబుపరమేశ్వరుండు - యీనాట్యవేదంబును- ప్రయోగమునజే-మృదువైనదియని- స్మరించి- చ



కముగా ప్రయోగింపబడియున్నదియని- తండుదోడగణాగ్రణ్యుండగు-ఆచార్యభరతునికొరకు.యీనాట్యవేదరహస్యంబులను-యుపదేశించెను - నంతరంమునులు- ఋషులు- గణాధ్యక్షుండగు-తండువల్ల యీతాండవంబును-దెలిసి-మానవులుగొరకు- యుపదేశించిరి-యీరీతున-పార్వతీ- దేవిచేతను - లాస్యమునగురించి బాణాసురిపుత్రిమైన - ఉషాదేవి- శిక్షింపబడునుయని - తాత్పర్యము- యీఉషాదేవిచేత- ద్వారవతీగోపికాస్త్రీలు-శిక్షింపబడిరి- యీగోపికాస్త్రీలుచే-సౌరాష్ట్రదేశీయ స్త్రీలు-శిక్షింపబడిరి-వీరులచే- నానాదేశంబులయందుండెడి-స్త్రీలుశిక్షింతురైరి- యీరీతున-పరంపరలుచే- యీమర్త్యలోకంబునందు - యీనాట్యవేదము-ప్రతిష్ఠితంబై యుండును- ... ... ❀

అథనాట్యభేదాః.

శ్లో॥శుద్ధదేశీబహుచరిత్రివిధంపరికీర్తితమ్।
శుద్ధంమార్గంశుభంప్రోక్తందేశీలోకానురంజినీ॥
బహుచారీవిధంనృత్తంభాగ్యనాశకమీరితం॥
బహుచారీవిధంతేషు దూరతఃపరివర్జయేత్॥

టీ॥ నృత్తంబు- శుద్ధం-దేశీ-బహుచరీ- యని- మూడువిధంబులు_ గలిగినదైయుండును-వీట్లయందు-శుద్ధమార్గంబనెడి- నృత్తము-శుభకరంబని-జెప్పబడియున్నది- దేశీమార్గంబనెడి - నృత్తము- జనులకు- అనురంజనకరంబని జెప్పబడియున్నది - బహుచారీవిధంబైననృత్తము-భాగ్యనాశకరంబని- జెప్పబడియున్నది-గనుక ఈబహుచారీయనెడినృత్తము- దూరంబుగావర్జింపవలయు-

శ్లో॥ రాజాస్థానేసభాస్థానేదేవాగారేయథాక్రమం।
బాహ్యాభ్యంతరంనాట్యంశుభదంశాస్త్రసమ్మతం॥
శుద్ధదేశీవిధంనాట్యంద్వివిధంమంగళప్రదం।

ఏవంనృత్తంమహాశ్రేష్టంసర్వకామార్థసిద్ధిదం।
భుక్తిముక్తిప్రదంన్వాణాంనృత్తోత్సవమిదంజగుః॥

టీ॥ శుద్ధం. దేశీయని-ద్వివిధంబైన- నాట్యము-రాజాస్థానంబునందు- సభాస్థానంబునందు- దేవాగారంబునందు- బాహ్యాభ్యంతరాలయందు- క్రమంబుగా-జనులకు-మంగళప్రదమనియును-సమస్తయిష్టార్థసిద్ధినిచ్చునదనియును- భుక్తిముక్తిప్రదమనియును- శాస్త్రసమ్మతంబైనదియును-దెలిసి ఈ నాట్యంబును- విద్వాంసులు-మహాశ్రేష్ఠంబైన-నృత్తోత్సవమని- చెప్పుదురు- *

అథచతుర్వింశతినాట్యభేదాః

శ్లో॥ శృంగారనాట్యముగ్రంచభృంగనాట్యంచచిత్రకం॥
నారినాట్యంచచాళీయంశుద్ధనాట్యంచసంశ్రుతమ్।
హస్తచాళీయనాట్యంచమార్గనాట్యంచసమ్మతం॥
అంగహారాఖ్యనాట్యంచపాదచారీచపార్శ్వకం॥
ముఖచాళీయనాట్యంచలవణినాట్యమీరితం।
దేశీనాట్యంఫేరణీచలీలానాట్యంతతఃపరం॥
తాండాళికంచసంధిశ్చప్రాంతనృత్యంప్రకాశ్యతే।
భూచారినాట్యమావృత్తంవిద్యుభ్రమరనాట్యకం॥
పుష్పాంజలిస్తునాట్యంచచతుర్వింశతినాట్యకం॥
యిత్యాదినాట్యభేదాశ్చభరతజ్ఞైరుదాహృతాః॥

టీ॥ శృంగారనాట్యమనియు- వుగ్రనాట్యమనియు - భృంగినాట్యమనియు- చిత్రనాట్యమనియు - చారినాట్యమనియు - చాళీయనాట్యమనియు- శుద్ధనాట్యమనియు - హస్తచాళీనాట్యమనియు-మార్గనాట్యమనియు- అంగహారనాట్యమనియు-పాదచారీనాట్యమనియు- పార్శ్వకనాట్యకమనియు - ముఖచాళీయనాట్యమనియు - లవణినాట్యమనియు - దేశీనాట్యమనియు-



ఫేరణీనాట్యమనియు- లీలానాట్యమనియు - తాండాళికనాట్యమనియు. సంధినాట్యమనియు- ప్రాంతనాట్యమనియు-భూచారినాట్యమనియు- ఆవృత్తనాట్యమనియు- విద్యుభ్రమరినాట్యమనియు - పుష్పాంజలినాట్యమనియు- యీరీతున నాట్యము- ౨౪ - యిరువైనాల్గు విధంబులవలనైయుండును- యీనాట్యభేదంబులు - భరతశాస్త్రజ్ఞులచేత చెప్పబడియుండును యీనాట్యకర్తలగు - సదాశివాది- ౩౬- ముప్పైయారు గంధకర్తల- నామంబులు - యీగ్రంధాదియందు చెప్పబడియుండును- ... *

రంగమంటపలక్షణమ్

శ్లో॥ సమస్తరాజ్యఉత్తాగారీకృష్ణాచయాభవేత్।
భూమిస్త్రత్రచకర్తవ్యాఃకారిభిఃనాట్యమంటపః॥
అస్థికీలకపాలానితృణగుల్మానిశోధయేత్॥
శ్రేణ్యుత్తరాణిసౌమ్యంచవిశాఖాపిచరేవతీ॥
హస్తతిష్యానురాధాచప్రశస్తానాట్యకర్మణి।
పరితశ్చతుర్రశ్రాస్యభిత్తయోగృహాసర్మితాః॥
సుధాసంస్యవలేపశ్చవిస్తారోభ్రయసంయుతః॥

టీ॥ సమస్తరాజ్యమునందు- భూమియు - కృష్ణశుక్రవర్ణము గలదై- యిట్టియుండునో-యాభూమియందు అస్థులు-కంటకంబులు-కపాలంబులు-తృణగుల్మంబులు - లేనట్లుశోధించి - ఉత్తర- ఉత్తరాషాఢ- ఉత్తరాభాద్ర- మృగశిర- రేవతి- హస్త - పుష్యమి - అనోరాధ- యసెడి- నాట్యకర్మప్రశస్తంబులగు- నక్షత్రంబులయందు- నాల్గుమూలలు- గలుగనట్లు- రంగమంటపనిర్మాణంగోరకుభిత్తులును- విస్తరింపజేసి- సున్నము జేతను - సంధులయందు - లేపనముగలిగినదిగాను- విస్తారము-వున్నత్తంబు - వీట్లదోడ-సంయుక్తంబైన- నాట్యమంటపము- జేయుయోగ్యము- ...

శ్లో॥ రమ్యంకుసుమసంకీర్ణంస్వర్ణరత్నవిభూషితం।
చిత్రోజ్జ్వలవితానాఢ్యంనీపికాశతశోభితం॥
పశ్చిమద్వారరహితంకర్పూరాగరుధూపితమ్।
ఏవంవిధగుణైర్యుక్తంమంటపంనృత్తదర్శనే॥

టీ॥ నృత్తదర్శనకాలంబునందు- యీరంగమంటపము-రమ్యంబై- పుష్పంబులచే-సంకీర్ణంబై-ద్రవ్యరత్నంబులచేభూషితంబై- చిత్రంబగునట్టు- ప్రకాశిస్తునుండెడి - మేలుకట్టుచే - శ్రేష్ఠంబై- దీపికాశతంబుచే- శోభితంబై - పశ్చిమద్వారరహితంబై-కర్పూరాగరుధూమధూపితంబై- యేవంవిధంబులైన- గుణములచే- యుక్తంబై - యుండవలయు - ... ... ...

రంగస్థలమనగ

శ్లో॥యత్రమేళనసంప్రాప్తిస్తద్రంగస్థానముచ్యతే॥

టీ॥ యచ్చట- సభానాయక- రాజపుత్ర- మంత్రి- సభాసద- విద్వజ్జనంబులు- మరియు- వేత్రధారి. సతాళ్వత్రమృదంగధారి- మదులగు- నాట్యోపాంగజనులు- మదులైన వారులయొక్క-సమ్మేళనము గలిగియుండునో- యది రంగస్థానంబనబడును-

సభానాయకలక్షణమ్-

శ్లో॥ శ్రీమాన్ధీమాన్వివేకీవితరణనిపుణోగానవిద్యాప్రవీణస్సర్వజ్ఞః కీర్తిశాలీసరసగుణయుతోహావభావే
ష్వభిజ్ఞః। మాత్సర్యాద్యైర్విహీనఃప్రకృతిహితసదాచారశీలోదయాళుర్ధీరోదాత్తఃకళావాన్న
[illegible]

[illegible]



సరసగుణంబులచే- గూడినవాడును- హావభావాదులయందు - తెలిసినవాడును- మాత్సర్యద్వేషంబులచే- రహితుండగువాడును- ప్రకృతిహితంబయిన- సదాచారశీలుండగు - దయావంతుండగు - ధీరోదాత్తుండగు- విద్యాకంతుండగు-రాజనీతులయందు- చతురుండగు- వాడుయెవ్వండోయతడుసభానాయకుండనబడును,

శ్లో॥ శృంగారరససంయుక్తః పాత్రాపాత్రవిశేషవిత్।
శ్రీమాన్గుణలవాంశ్చాపిగ్రాహకఃకౌతుకీరతః॥
వాగ్మీనిమత్సరోధీరఃసద్ధర్మనిపుణస్సుధీః।
గంభీరభావఃకుశలస్సకలాసుకలాస్వపి॥
సమస్తశాస్త్రవిజ్ఞానసంపన్నఃకీర్తిలోలుపః॥
ప్రియవాక్పరచిత్తజ్ఞస్సూర్యత్రయవిశేషవిత్।
స్వాధీనపరివారశ్చభావజ్ఞోరసనిర్భరః।
సత్యవాదీదకుశలఃప్రసన్నవదనాంబుజః।
స్త్రీప్రేమారసజ్ఞశ్చకరుణావరుణాలయః॥
ధర్మిష్ఠఃపాపరహితోవిద్వద్బంధుస్సభాపతిః॥

టీ॥ శృంగారరసంబుచే- యుక్తుండగు - పాత్రాపాత్రంబులయొక్క- విశేషంబుతెలసినవాడగు- ఐశ్వర్యవంతుడగు - సద్గుణములయొక్క- లేశంబునను- గ్రహించువాడగు-కౌతుకంబునందు- యాసక్తువాడగు- వాచాలకుండగు- మాత్సర్యరహితుండగు- ధీరుండగు- సద్ధర్మంబులయందు-సమర్థుండగు- బుద్ధిశాలియగు, గంభీరంబయిన- మనస్సుగలవాడగు- సకలవిద్యలయందు- కుశలుండగు- [illegible]

[illegible]

[illegible]

యిన-పరివారజనంబుగలవాడగు- భావంబును-దెలిసినవాడగు-రసంబులచే - పరిపూర్ణంబయినవాడగు-సత్యంబయినవాక్కు-గలవాడగు- సమర్థుండగు-ప్రసన్నంబయిన-వదనకమలంబుగలవాడగు-స్థిరంబయినప్రేమగలవాడగు-శృంగారాదినవరసంబులను-దెలిసినవాడగు-కరుణారసంబునకు-సముద్రప్రాయుండగు - ధార్మికుండగు-పాపంబులచే-రహితుండగు-విద్వజ్జనులకు బంధువగువాడు- సభాపతియనబడును. ... ... ... *

మంత్రిలక్షణమ్

శ్లో॥ ఏకాంతే స్థిరభాషిణో గుణపరాః శ్రీమద్యశో లంపటా భావ
జ్ఞా గుణదోషభేదనిపుణాః శృంగారలీలారతాః। మధ్యస్థా
నయకోవిదస్సహృదయాస్సత్పండితా భాంతి తే భాషాభేద
విచక్షణాస్సుకవయో యేవ ప్రభూర్మంత్రిణః॥

టీ॥ స్థిరంబులైన - భాషలుగలవారలగు - సుగుణంబులయందాసక్తులగు- సత్కీర్తియందు- యాసక్తులగు - భావంబులను-దెలిసినవారలగుగుణదోషంబులయొక్క-భేదంబులను దెలిసినవారలగు- శృంగారలీలలయందాసక్తులగు. వ్యవహారాదులయందు మధ్యస్థులగు. రాజనీతులను. దెలిసినవారలగు- సహృదయులగు-సత్పండితులగు-భాషాభేదంబులయందు- విద్వాంసులగు - సత్కవులగు- యేమంత్రులు. ప్రభుసాన్నిధ్యమందు - ప్రకాశిస్తునుందురో- యామంత్రులు-వృద్ధిఁబొందుదురు- ... *

సభామేళనేతదుపవేశలక్షణమ్-

శ్లో॥ నృపతిః ప్రాఙ్ముఖస్తత్రోపవిశేత్ వరాసనే।
రాజపుత్రో వ[illegible]మాత్యో వరమండలికాదయః॥
అస్యాపి దక్షిణే పార్శ్వే నివిశేయుర్మహీపతేః।
[illegible]



వామపార్శ్వే నిషణ్ణాస్స్యుః విలాసిన్యస్తు పశ్చిమే।
తిష్ఠేత్పురతో వేత్రీ వినయేనాతి దూరతః॥

టీ॥ యా రంగమంటపమునందు-సభానాయకుండైన రాజు శ్రేష్ఠంబైన- సింహాసనమందు ప్రాఙ్ముఖుండై - కూర్చుండుకోవలయు- రాజపుత్రుండు- మంత్రియు- యితరదేశస్థులైన రాజులు-తదితరజనులు- యా రాజుకు-దక్షిణభాగంబున- కూర్చుండుకొనియుండవలయు. స్తుతిపాఠకులు- మాగధులు- సూతలు - కవీశ్వరులు-నటులు- నర్తకులు - యా రాజుయొక్క-వామపార్శ్వంబునందు- కూర్చుండుకొనియుండవలయు- విలాసినీజనులు. పశ్చిమభాగమునందు-కూర్చుండుకొనియుండవలయు, వేత్రధారియు- వినయముచే. పురోభాగంబునసమీపంబునందు-నిలచినవారైయుండవలయు-

సభాలక్షణమ్-

శ్లో॥ యా హంసీవ పదక్రమేణ చతురా యా స్వర్ధునీవా
మలా నిత్యం విష్ణుపదే రతా కమలినీవాసన్నహంసావలిః॥
యా రాకా రజనీవ చాఖిలకలాపూర్ణా ద్విజేంద్రాశ్రి
తా వాణీవ చ్చతురాననప్రముదితా సైషా సభా రాజతే॥

టీ॥ పాదవిన్యాసంబులచే-చతురంబైన- హంసజొప్పున-వేదంబులయొక్క-పదక్రమంబులచే- చతురంబైనది- యదియు- నిర్మలంబైన-సర్వకాలంబులయందు. విష్ణువుయొక్క-పాదంబునందు-యాసక్తంబైన- స్వర్గముజొప్పున-నిర్మలంబైనదియు - విష్ణువుయొక్క-పాదంబునందు-యాసక్తంబయినది-యదియో-సమీపవర్తియగు- హంసంబులయొక్క-సమూహంబుగల- కమలలతాజొప్పున- సమీపవర్తియగు-పరమహంసులయొక్క - సమూహంబుగలది-యదియో-సమస్తంబులైన-[illegible]లచే- సంపూర్ణుండగు-
[illegible]

తద్దేశీయజనానాంతుమనసో యత్ర రంజనం।
గానంచ వాదనం నృత్తం తద్దేశీత్యభిధీయతే॥

టీ॥ గీతము- వాద్యము- నృత్తము- యీ 3 న్ను సంగీతంబని చెప్పబడును- సంగీతమందు- శుద్ధము- దేశీ యని-మార్గము- రెండు ప్రకారంబులుగా జెప్పబడి యుండును- బ్రహ్మదేవుండు మొదలైన వారలచే- భరతాదులచే- పరమేశ్వరుని యొక్క- పురోభాగంబునందు- ప్రయోగింపబడి యుండునో- యది శుద్ధమార్గంబనియు- యావమార్గంబునందు- గానము-వాద్యము- నృత్తము- యివి 3 న్ను దేశీయజనుల యొక్క- మనస్సుకు- రంజకమగునట్టుగా- యుండునో- యది- దేశీమార్గంబనియు- చెప్పబడియుండును.

గాయకలక్షణమ్.

శ్లో॥ వివిధాలాపచతురో గ్రహమోక్షే చ శిక్షితః।
స్థానత్రయ విశేషజ్ఞో గంభీర మధురధ్వనిః।
నానారాగ విశేషజ్ఞస్తాళభేద ప్రయోగవిత్।
వశీజితశ్రమోరక్తః కంఠస్వరవిధానవిత్॥
పునఃపునశ్చ రాజ్ఞస్తు ప్రౌఢచిత్తోపరంజకః।
శిక్షితస్సదుపాధ్యాయాత్స్వరసప్తకభేదవిత్।
అకాకుర్విభావజ్ఞః గాయకః పరికీర్తితః॥

టీ॥ నానావిధంబులైన - యాలాపంబులయందు- సమర్థుండగు- స్వరగ్రహమోక్షంబులయందు- శిక్షితుండగు- మంద్రమధ్యమతారకంబులయందు- విశేషజ్ఞాతయగు- గంభీరంబయిన- మధురస్వరంబుగలవాడగు- అనేకరాగవిశేషంబులు-దెలిసినవాడగు- తాళభేదప్రయోగంబులును దెలిసినవాడగు - పరాధీనుడుగాక యుండువాడు- జితశ్రమగలవాడగు- సంగీతానురక్తుండగు - కంఠసంబంధంబులైన- స్వరములయొక్క- క్రియ దెలిసినవాడగు - మాటికి



మాటికి - రాజుయొక్క- ప్రౌఢంబయిన చిత్తమునకు - ఉపరంజకుండగు దెలిసిన ఉపాధ్యాయుల వల్ల శిక్షితుండగు సప్తస్వరములయొక్క- భేదంబులు దెలిసిన వాడగు శోకభీత్యాదులచే బుట్టిన ధ్వని వికారంబులేనివాడగు - యీగుణంబులు దోడగూడియుండువాడు గాయకుడని జెప్పబడును-

ఆలాపచారికాలక్షమ్

శ్లో॥ కరోతి స్వేష్టరాగేణ శుష్కాలాపం తు గాయకః।
నర్తకీనృత్తకాలే తు సా ప్రోక్తాలాపచారికా॥

టీ॥ నర్తకియొక్క నృత్తకాలంబునందు- గాయకుండు - తనకిష్టంబైన- రాగముచేత-శుష్కాలాపమును- జేస్తునాడో - యాశుష్కాలాపరూపకంబైన- గీతి- ఆలాపచారికాయనబడును,

మృదంగలక్షణమ్-

శ్లో॥ పురా మురాసురం హత్వా భగవాన్భక్తవత్సలః।
తత్కళేబరమాదాయ మర్దళం కృతవాన్విభుః॥

టీ॥ పూర్వమునందు సమర్థుండైన- భక్తులయందు వాత్సల్యంబుగల- భగవంతుడైన నారాయణమూర్తి- మురాసురుని సంహరించి యతని దేహమును-స్వీకరించి మర్దళమును జేసెను.

శ్లో॥ రక్తచందనపిండేన ఖాదిరస్యాథవా పునః।
నిర్దోషేణాన్యజేనాపి కారయేన్మర్దళం సుధీః॥
అష్టచత్వారింశదాహురంగుళాని ప్రమాణకమ్।
చతుర్దశతు వామాస్యే దక్షిణే తు త్రయోదశ॥
మధ్యే ద్వాంగుళ్యూనమితం కుర్యాద్వృత్తం తు మర్దళం।
తన్మధ్యే కోటరం వృత్తం రంధ్రాకారేణ కారయేత్॥
చర్మత్రయయుతే చ క్రేణైకృత్వా తు తతః పరం।
ఏకస్య మధ్యమే భాగే ఛేదయేద్వాదశాంగుళం॥

పాత్రశబ్దలక్షణమ్.

శ్లో॥ పకారాత్ పాదచారిత్వాత్ త్రకారాత్ త్రాణకృత్యతే।
రేఖాంగాగ ఇతిప్రోక్తః పాత్రశబ్దార్థకోవిదైః॥

టీ॥ పకారంబు- పాదచారియని- తకారము- త్రాణంబని- రేఖంబు- రాగంబని- యీమూడుచేరినది- పాత్రయనబడును. తత్పాత్రయగు- నటియొక్క- అంగాదులయందు-దేవతాలు నాట్యకాలమందు యాశ్రయించియుండే- క్రమము.

శ్లో॥ పాత్రస్యాంగేషు తిష్ఠంతి దేవతాస్సముపాశ్రితాః।
బ్రహ్మరంధ్రే స్థితో దేవః సదాశివ ఇతీరితః॥
లలాటే క్షేత్రపాలస్తు శాక్యః కట్యంతకే స్థితః।
మణిబంధే మహాదేవో పరమేశస్థితో మహాన్॥
కరస్థలే చలా లక్ష్మీ కరాగ్రేజయ పార్వతీ।
వక్షస్థలే హృషీకేశః స్తనయోర్మేరుమందరౌ॥
నాభౌతు దేవతా లక్ష్మీ జఘనే పృథివీ తథా।
ఊర్వోర్దేవస్సహస్రాక్షః జంఘయోః కమలాసనః॥
జాన్వోశ్చ దేవతా వాయుః దృష్ట్యోశ్చైవ వరాహసుతః।
ఉభయోః పాదయోరేతౌ చంద్రసూర్యౌ ప్రకీర్తితౌ॥

టీ॥ పాత్రయొక్క యంగంబులయందు - దేవతలు - యాశ్రయించి- నటనకాలమందుయుందురు - అదియెట్లనిన- బ్రహ్మరంధ్రంబునందు- పరమేశ్వరుండగు - సదాశివుండు - లలాటమునందు- క్షేత్రపాలకుడు- కటిమధ్యమునందు- బుద్ధదేవుండు-మణికట్టుయందు- మహాదేవుండగు- పరమేశ్వరుడు- కరతలంబునందు- ఐశ్వర్యలక్ష్మియు- కరాగ్రంబునందు- పార్వతియు - వక్షస్థలమునందు- హృషీకేశుండు- స్తనంబులయందు- మేరుమందరములు-నాభియందు- లక్ష్మీదేవియు - జఘనంబునందు - భూదేవియు- ఊరులయందు -



ఇంద్రుడు- జంఘంబునందు బ్రహ్మదేవుడు- జానూలుయందు- వాయుదేవుండు- దృష్టులయందు- మన్మథుండు - వుభయపాదంబులయందు- చంద్రసూర్యులు- యీవొప్పన - నటియంగంబులయందు- నాట్యకాలమందు- వాసముచేసుకొనుందురుగనుక- నటీ సకలదేవతాస్వరూపరాలంబైయుండును. ... ... *

శ్లో॥ తన్వీరూపవతీ శ్యామా పీనోన్నతపయోధరా।
ప్రగల్భా సరసా కాంతా కుశలా గ్రహమోక్షయోః॥
చారతాళలయాభిజ్ఞా మండలస్థానపండితా।
హస్తాంగస్థాననిపుణా కరణేషు విలాసినీ॥
విశాలలోచనా గీతవాద్యతాళానువర్తినీ।
పరార్థభూషాసంపన్నా ప్రసన్నముఖపంకజా॥
నాతిస్థూలా నాతికృశా నాత్యుచ్చా నాతివామనా।
ఏవం గుణవిధోపేతా నర్తకీ సముదాహృతా॥

టీ॥ సూక్ష్మాంగియైనదియు- సౌందర్యవంతురాలగు | యవ్వనవత్స్థరాలగు - కలిసిన- వున్నతంబైన-పాలిండ్లుగలిగినదియు- ప్రౌఢరాలగు- రసికురాలగు- యితరులయొక్క-మనుస్సును - అపహరించేదియగు- స్వగ్రహమోక్షంబులయందు- నేర్పడియగు- చారి-తాళ-లయంబులయందు-కుశలురాలగు-మండలిస్థాననాట్యనృత్యంబులయందు- పండితరాలగు - కరణంబులయందు చాకచక్యరాలగు- హస్తాంగస్థానంబులయందు- నిపుణరాలగు- విస్తారంబులైన- నేత్రంబులుగలదియగు- గీతవాద్యతాళంబులును. యనుసరించియుండేదియగు- శ్రేష్ఠంబులైన- యాభరణములచే- యుక్తురాలగు- ప్రసన్నంబైన - ముఖకమలంబుగగినదియగు - అతిస్థూలరాలు- అతికృశరాలు- అత్యున్నతరాలు - అతికుబ్జరాలు - యివిగానిదియగుయిత్యాదిగుణంబులతో గూడియుండెడి- పాత్రము-న

ళాచార్యుడు-చక్కగా-యాలోచించి- యూరుకంచుకంబును-జఘనాంతపర్యంతము-ఊరుమధ్యపర్యంతము- జాన్వంతపర్యంతము-జానుమధ్యపర్యంతము- గుల్ఫపర్యంతము -యీరీతున-నైదువిధంబులుగా-విధించినవాడాయెను కింకిణీసమూహంబుచేయుక్తంబైన గుల్ఫాంతపర్యంతం బుండెడికంచుకంబను పట్టసూత్రముచే- గట్టబడి-సభయందు- స్త్రీలుధరింపయోగ్యము-

శ్లో॥ ఉత్తమైర్మధ్యమైః పాత్రైరధమైర్ధార్యతే యః॥
అధోరు జఘనాంతంచ పురుషాణాం ప్రశస్యతే॥
ప్రాయస్త్రీభిర్ధార్యమేవ దేశీనృత్తస్యకర్మణి।
శుద్ధమార్గీయనాట్యేచ బహుచార్యాంతథైవచ॥
సంకీర్ణేమార్గసంకీర్ణే శస్తమాగుల్ఫకం క్రమాత్॥

టీ॥ వుత్తమమధ్యమాధమపాత్రంబులచే-ఊరుకంచుకంబు- ధరింపబడితే-పురుషులకు-అధోరుపర్యంతరంబు-జఘనాంతపర్యంతరంబు యుండెడి కంచుకము - ప్రశస్తంబైయుండును - దేశీనృత్తకర్మయందు- శుద్ధదేశీయనాట్యంబులయందు-బహుచారీ- నృత్త్యమందు మార్గసంకీర్ణనృత్తమందు-గుల్ఫపర్యంతరము-యుండెడి - కంచుకము స్త్రీలుచేతను-ధరింపబడినదైయుండవలయు-

ఊరుకంచుకధారణలక్షణమ్-

శ్లో॥ ఆదౌదేవంగురుంపంచభూతాన్నత్వోరుకంచుకం।
నానాచిత్రపటైఃక్లుప్తంధారయేన్నాట్యకర్మణి॥

టీ॥ పాత్రనాట్యకర్మయందు- ఆదియందు-యిష్టదైవంబును తనవిద్యాగురువును- పంచభూతంబులుకు-నమస్కరించి-నానాచిత్రపటంబులచే-నిర్మితంబైన- ఊరుకంచుకంబును-ధరించవలయు-

యవనికాలక్షణమ్

శ్లో॥ ధార్యాయవనికారమ్యానానావర్ణవిభూషితా।



భావైర్బహువిధాకారైరంజయంతిజగత్రయం॥

టీ॥ రమ్యంబైన- నానావర్ణంబులచే-భూషితంబైన-నానావిధయాకారంబులు గలనిర్మాణభావంబులచే - లోకత్రయంబును-యనురంజనమును - జేయుచుండెడియవనికా- రంగస్థలంబునందు-ధరింపయోగ్యంబైయుండవలెను. ... ... *

కింకిణీలక్షణమ్.

శ్లో॥ కింకిణీఃకనకేనాథ తామ్రేణరజితేనవా।
లోహేనవాయథాశక్తి కారయేద్ఘుటికాంతరాః॥
సుస్వరాశ్చసురూపాశ్చ సూక్ష్మానక్షత్రదేవతాః।
బధ్వాపినీలసూత్రేణ గ్రంధిభిశ్చవిశేషతః॥
శతంవాద్విశతంవాపి పాదయోర్నాట్యకర్మణి।
కింకిణీవదనేవాణీ తన్మధ్యేకమలాలయా॥
తదాదౌగిరిజాప్రోక్తా శంకరానందకారిణీ।
తస్మాత్సర్వప్రయత్నేన వాద్యాన్నృత్తైర్విశేషతః॥
మణిబంధేపాదమూలే ధారయేచ్ఛాస్త్రకోవిదః॥

టీ॥ సువర్ణము- రజితము- తామ్రము- లోహము- వీట్లచే- శక్తినియతిక్రమించునట్లు- ఘుటికంబులు- మధ్యమంబు- గల- కింకిణీలును- చేయించవలయు- సుస్వరంబుగలవియగు - సురూపంబుగలదియగు- సూక్ష్మంబులైనవియగు-నక్షత్రంబులు-యధిదేవతగా- గలిగినవియగు - నీలసూత్రంబుచే- గ్రంధులచే- విశేషంబుగా- గట్టబడినవియగు- కింకిణీలును- నాట్యకర్మయందునూరుగాని - యిన్నూరుగాని- పాదంబులయందు-ధరింపవలయు- యీకింకిణీలయొక్క-ముఖంబులయందు- సరస్వతియు- మధ్యమునందు- లక్ష్మీదేవియు - యాదిభాగంబునందు- శంకరానందకారిణి- యగు - పార్వతీదేవియు-యుండునని చెప్పబడియుండును-యాకారణంబువల్ల - సర్వ

ప్రయత్నముచే- వాద్యకాలమందు- మణికట్టుయందు- నృత్తకాల మందు- పాదమూలంబునందు- శాస్త్రకోవిదడగు- నటుండు- ధరింపవలయుననితాత్పర్యము. ... ... ...*

కింకిణీబంధశ్లోకః.

శ్లో॥ వాణీలక్ష్మీశైలసుతా దేవతాంసీలసూత్రికాం।
శతగ్రంధిసమాయుక్తాం కింకిణీంప్రణమామ్యహం॥

టీ॥ సరస్వతియు- లక్ష్మియు- పార్వతీదేవియు- యీముగ్గురు- యధిదేవతలుగాగల- సీలసూత్రముగల- శతగ్రంధులచే-గూడుగోనియుండెడి-కింకిణీలనుగురించి-నేనునమస్కారంచేస్తున్నాను.

నాట్యరత్నాకరె.

శ్లో॥ సంధ్యానాట్యేమహాదేవో బధ్నాత్యయుతకింకిణీం।
భృంగేశ్వరస్స్వయంనాట్యేతథాసాహస్రకింకిణీః॥
మంజుఘోషస్వనాట్యేతుసార్ధసాహస్రకింకిణీః।
తిలోత్తమాస్వయంనాట్యేకింకిణీనాంసహస్రకం॥
ఊర్వశీచైవరంభాచనాగదంతాచవారుణీం।
కింకిణీనాంసప్తశతైర్మాలాఃకుర్వంతిశోభనాః॥

టీ॥ మహాదేవుండు. సంధ్యాకాలనాట్యమందు-పదివేలు కింకిణీలను- గట్టుగొనినాట్యమును జేసును- భృంగీశ్వరుండు- సహస్రకింకిణీలను-గట్టుగొని-నాట్యమును జేసును-మంజుఘోషుండు - అయినూరుకింకిణీలనుగట్టుగొని-నాట్యమును జేసును-తిలోత్తమాయనెడి యప్సరస్త్రీయు-సహస్రకింకిణీలు గట్టుగొని - నాట్యమును జేసును- ఊర్వశీ-రంభా- నాగదంతా - వారుణి - యీనలుగురు- యప్సరస్త్రీలు- యేడునూరింతున - కింకిణీలుయొకట-మాలికనుధరించ్చి- నాట్యంబును- జేయుదురు.

శ్లో॥ మానుషాణాంచసర్వత్రశ్వయాన్నేదః ప్రకీర్తితః॥



కృతేపంచశతంప్రోక్తం త్రేతాయాంచచతుశ్శతం॥
ద్వాపరేత్రిశతంప్రోక్తం కలావష్టోత్తరంశతం॥
అష్టావింశత్యుత్తరంవాపష్టాంతరమితిస్మృతం॥

టీ॥ భూలోకంబునందు సమస్తదేశంబులయందును- మానవులకు - కింకిణీలు- కృతయుగమందు - ౫నూరులు - త్రేతాయుగమునందు- ౪ల్లు. నూరులు- ద్వాపరయుగమునందు - ౩మూనూరులు- కలియుగమునందు- ౧౦౮ - యు - పష్టాంతరంబునందు- ౧౨౮- యీరీతున-కింకిణీమాలికలను- గట్టుగొని- నృత్తంనృత్య- నర్తనంబులను-జేయువలయునని జెప్పబడియుండును-

రంగమంటపపాత్రప్రవేశలక్షణమ్

శ్లో॥ దివ్యవస్త్రధరాంనారీందివ్యాభరణభూషితాం।
ఏవంతుమేళనంకృత్వారంగస్థానంప్రవేశయేత్॥

టీ॥ దివ్యవస్త్రంబులు-ధరించ్చియుండెడి- దివ్యంబులైనయాభరణంబులు జే- భూషితరాలగు-నటీని- యీచొప్పున - మేళనమును జేసి. రంగస్థానంబునుప్రవేశింపజేయవలయు-

పూర్వరంగస్థానమునకు-నటిరాతగ్గసంప్రదాయము-

శ్లో॥ ఉత్తమాధమమధ్యాశ్చకనిష్టస్సంప్రదాయకాః॥
సంప్రదాయోవిశేషేణదేశీదేశప్రవర్తితా॥

టీ॥ ఉత్తమము-మధ్యమము- అధమము- కనిష్ఠము-యని- చతుర్విధసంప్రదాయములు- వీట్లయందు-దేశములయందు- ప్రవర్తించియుండెడి-దేశీసంప్రదాయము- విశేషంబుగా- ప్రసిద్ధంబైయుండును- గనుక-యీదేశీసంప్రదాయముచే-పాత్రను - రంగస్థలంబును-ప్రవేశింపజేయువలయు- *

రంగస్థానంబునందుపాత్రమ్యాళంచిలిచేవిక్రమము.

శ్లో॥ రంగమధ్యస్థితేపాత్రే వామభాగేనటోత్తమః।

దక్షిణేతాళధారీచ పార్శ్వయోస్తుమృదంగికౌ॥
తయోర్మధ్యే గీతకారీ లాస్యక్రమఇతీరితః।

టీ॥ రంగమధ్యమునందు-పాత్రనిలచినది-అగుచునుండగను- శ్రేష్టంబైన-నటుడు- వామభాగంబునందును- తాళంబును- ధరించినవాడు-దక్షిణభాగంబునందును-ఉభయమృదంగధారులు-నటియొక్క- ఉభయపార్శ్వంబులందును-గానముజేయువాడు- యీమార్దంగికులయొకరి- మధ్యభాగంబునందును - నిలిచియుండవలయు- యిట్లునిలుచుట- లాస్యక్రమంబని- జెప్పబడియుండును.

రంగస్థానంబునందు- పాత్రమదులైనజనులు సూ
త్రధారినియనుసరించియుండుట క్రమము.

శ్లో॥ సూత్రధారమనుసృత్య గాయకాస్తాళమర్దళధరాః
పరేచయే। తేపిభావినటనానుకూలతః పూర్వరం
గముపఘోషయంత్యమీ॥ *

టీ॥ గాయకులుయితరులగు- తాళము- మృదంగము- మదులైనవాట్లును - ధరించియుండెడివారు యెవరో - వారులు - సూత్రధారుణ్ణి - యనసరించి- పూర్వరంగమును - ఉపఘోషము- జేస్తున్నుండవలయు. ... ... *

నేపథ్యలక్షణమ్.

శ్లో॥ అఖండమండలంచిత్రం విస్తీర్ణందీర్ఘమంశుకం।
విస్తృత్యపూర్వరంగేస్మిన్నేపథ్యంకల్పయేద్బుధః॥
నేపథ్యాంతరితఃపూర్వం రంగపూజాంసమాచరేత్।

టీ॥ అఖండమండలాకారంబైన నానావిచిత్రంబైన- విస్తారంబగు- దీర్ఘంబుగాయుండెడి- వస్త్రమును- దెలిసినవాడు- నేపథ్యంబుగా-పూర్వరంగంబునందు- విస్తరింపుజేసి-నేపథ్యమందలి- అంతరితుండైయు- నాట్యమునుగంటే- పూర్వమునందు-రంగస్థానపూజను జేయవలయు. ... ... ... *



శ్లో॥ అకృత్వాపూజనంపాత్రా మాచరేద్యదినాట్యకం।
తన్నాట్యంనీచమిత్యాహు నాట్యశాస్త్రవిదోబుధాః॥

టీ॥ నాట్యసేయు- పాత్ర- పూర్వరంగమునందు- పూజజేయకనాట్యంబును- జేసినదైతే- యానాట్యమును- నాట్యశాస్త్రజ్ఞులగు- విద్వాంసులు- నీచనాట్యంబని- జెప్పుదురు. *

— నీచపాత్రకృతనాట్యదర్శనఫలమ్. —

శ్లో॥ నీచపాత్రకృతంనాట్యం యదిపశ్యంతిమానవాః।
పుత్రహీనాభవిష్యంతి జాయంతేపశుయోనిషు॥

టీ॥ నీచపాత్రజే- జాయబడిన - నాట్యంబును - మానవులు - జూచినవారులైతే- యాజూచిన- మానవులు- పుత్రహీనులు-వరియు- పశుయోనుల- యందుబుట్టేవారులుయగుదురు. *

నాట్యక్రమమ్.

శ్లో॥ తస్మాత్సర్వంసమాలోచ్య పూర్వైకైర్యదుదాహృతం।
దేవతాప్రార్థనాదీనీ కృత్వానాట్యముపక్రమేత్॥

టీ॥ యాకారణంబువల్ల. దేవతాప్రార్థనమొదలుయగు - సమస్తములును - పూర్వీకులుచేత - యుదాహరింబడ్డజకరీగా- యవాలోచించి - యాసంప్రదాయజొప్పున - నడిపించి - నాట్యము- చేయవలయు. ... ... ... ... *

శ్లో॥ కంఠేనాలంబయేద్గీతిం హస్తేనార్థంప్రదర్శయేత్।
చక్షుర్భ్యాందర్శయేద్భావం పాదాభ్యాంతాళమాచరేత్॥

టీ॥ నటనముజేయు-పాత్ర- యాదియందు- కంఠంబుజే- గీతంబును-ఆలంబించవలయు-హస్తంబుజే- యర్థమును - జూపింపవలయు- నేత్రంబులజే భావంబును- జూపింపవలయు - పాదములచే- తాళమును-ఆచరింపవలయు- ... ... *

శ్లో॥ యతో హస్తస్తతో దృష్టిర్యతో దృష్టిస్తతో మనః।
యతో మనస్తతో భావో యతో భావస్తతో రసః॥

టీ॥ యచ్చటను హస్తగితార్థమును - సూచనజేయు హస్తంబును- యుండునో- యచ్చట - దృష్టియు-యుండవలయు- యచ్చట - దృష్టి యుంచబడియుండునో- యచ్చట-మనంబును యుంచవలయు-యచ్చట- మనస్సు- యుంచబడియుండునో- అచ్చట-భావము బుట్టును- యచ్చటభావము- బుట్టునో- అచ్చట-రసంబుబుట్టును-

పాత్రనిలిచి పాదాక్షరంబులు జెప్పుక్రమము-

శ్లో॥ రంగస్థలం ప్రవిశ్యాథ నర్తకీ నాట్యవిచక్షణా।
హస్తం మృదంగే విన్యస్య పాదాక్షరముదీరయేత్॥

టీ॥ పూర్వరంగోపఘోషణానంతరంబున- నాట్యంబును - దెలిసి- విచక్షణరాలగు నటీ- నమస్కారంబును - యాచరించి- హస్తంబును- మృదంగముయందు - ఉనచి - పాదాక్షరంబులును జెప్పవలయు- ... ... ... ... ... ... *

పాత్రప్రథమవాద్యలక్షణమ్-

శ్లో॥ వాదయేత్ప్రథమం శుష్కం కాంస్యం గంభీరసంయుతం॥
గీతం నృత్తం వినా విఘ్నశాంత్యర్థం చ సమాచరేత్॥

టీ॥ నాట్యాదియందు- విఘ్నములయొక్క - శాంతిగొరకు- శుష్కంబైన కాంస్యవాద్యమును- గంభీరధ్వనితోడ - యుక్తంబగునట్లు- గీతనృత్తములు విడిచి- ధ్వనియుక్తంబుగా- జేయవలయు-

పాదాక్షరశుష్కవాద్యలక్షణమ్

శ్లో॥ ఆదౌ తోదిగిధాంధాంధాంధికిటతోంధికతాదికం।
తోంగుత్తకాదిత్వం తేవ శుష్కవాద్యం ప్రకీర్తితం।

టీ॥ ఆదియందు- తోదిగిధాంధాంధాంధికిటతోధికతా- యివిమదులుగాగల- యక్షరంబులును-అంత్యమందు- తోంగుత్తక-యి



విమదులైన- యక్షరంబులును- బలుకుట - శుష్కవాద్యంబని జెప్పబడియుండును, ... ... ... ... ... *

పాత్రనటనారంభలక్షణమ్

శ్లో॥ మృదునదతి మృదంగే న్యస్తహస్తారవిందా సులలిత
మబలానాం గీతమాకర్ణయంతీ। పదయుగకృత
తానా రాగమాలంబయంతీ కలయతి ముదమేషాన
ర్తకీ నర్తనాదౌ॥

టీ॥ మృదువగునట్లు బలుకుచుండెడి- మృదంగముపైన-నటి- యుంచబడ్డహస్తారవిందంబుగలిగినదై- లలితబగు- స్త్రీలయొక్క-గీతమును- ఆకర్ణనము - జేస్తునుండెడిదై - పదయుగంబుచేత- జేయబడ్డ- తానంబులు- గలదై - రాగంబును - యాలంబనమును- జేస్తూ- నర్తనాదియందు- జూచేజనులకు- సంతోషంబును- జేస్తుండవలయు- యితాత్పర్యము-

వినాయకాదిదేవతాప్రార్థనా-

శ్లో॥ విఘ్నరాజం భారతీం దేవీం బ్రహ్మవిష్ణుమహేశ్వరాన్।
రంగేశదేవతాం వందే తాళవాద్యాదిభిః క్రమాత్॥

టీ॥ విఘ్నేశ్వరుండు సరస్వతీదేవి - బ్రహ్మవిష్ణుమహేశ్వరుండు- రంగస్థానమందుయుండెడి- తదభిమానదేవతె- వీరలను-గురించి తాళవాద్యాదులచే - క్రమంబుగా - నమస్కారంబును జేస్తున్నాను;

అభినయలక్షణమ్.

శ్లో॥ తత్రత్వభినయస్యైవ ప్రాధాన్యమితి కథ్యతే।

టీ॥ రసభావాదులను దెలుసుటకు. యభినయమునకే- ప్రాధాన్యమును- జెప్పబడుచున్నది- ... ... ... ... *

అభినయమనంగా-

శ్లో॥ అభిపూర్వస్య ణీఞ్ ధాతోరాభిముఖ్యార్థనిర్ణయః॥

యస్మాత్పదార్థాన్నయతి తస్మాదభినయస్స్మృతః॥

టీ॥ యాభియనెడి- ఉపసర్గ- పూర్వమందుగల - ణీఞ్ ధాతువను- తానుచ్చరించెడి- పదములయొక్క- శబ్దార్థములను- ణీఞ్- యనెడిధాతువు- విషయములనుగా- జేసుకొంచున్నదిగనుక- యెకారణమువల్లనీ ధాతువు- పదములయర్థములను - బొందిస్తుంనున్నదో- ఆకారణంబువల్ల- అభినయమనంబడును-

శ్లో॥ ఆఙ్గికో వాచికస్తద్వదాహార్యస్సాత్త్వికః పరః।
చతుర్థాభినయస్తత్ర చాంగికోంగైర్నిదర్శితః॥
వాచా విరచితః కావ్యనాటకాదిషు వాచికః।
ఆహార్యో హారకేయూరవేషాదిభిరలంకృతిః॥
సాత్త్వికస్సాత్త్వికైర్భావైర్భావజ్ఞైన విభావితః॥

టీ॥ ఆంగికమనియును - వాచికమనియు- ఆహార్యమనియు- సాత్త్వికమనియు - అభినయము - నాలుగువిధంబులుగా జెప్పబడియుండును- వాట్లయందు - యంగములచేతను జూపింపబడినది - ఆంగికాభినయమనుబడును - కావ్యనాటకాదులయందు - వాక్కుచే- రచియింపబడినది- వాచకాభినయమనబడును - ముక్తాహారాదిహారలు- బాహుబురులు- వీట్లచేతనైన- వేషంబులచే- అలంకారము - ఆహార్యాభినయమనంబడును, సాత్త్వికభావంబులచేత - భావింపబడినదిసాత్త్వికాభినయంబనంబడును-

ఆంగికాభినయత్రైవిధ్యమ్

శ్లో॥ తత్రాంగికోంగప్రత్యంగోపాంగభేదాత్త్రిధామతః॥

టీ॥ ఆంగికాభినయంబునందు - అంగాభినయంబనియు- ప్రత్యంగాభినయంబనియు - ఉపాంగాభినయంబనియు- మూడువిధంబులై యుండును- ... ... ... ... *



పాత్రప్రవేశానంతరక్రమము-

శ్లో॥ విఘ్నానాంశమనంకర్తుం భూతానాంరక్షణాయచ।
దేవానాంతుష్టయే చైవ ప్రేక్షకానాం విభూతయే॥
శ్రేయసే నాయకస్యాత్ర నాట్యకర్తుః ప్రియాయచ।
రంగభూశుద్ధిభూత్యైవ పాత్రసంరక్షణాయచ॥
ఆచార్యశిక్షాసిద్ధ్యర్థం రంగపూజాం సమాచరేత్॥

టీ॥ విఘ్నంబులయొక్క- శమనము చేసుటకొరకు- పంచభూతంబులయొక్క-సంరక్షణంబుగొరకు- దేవతులయొక్క-సంతుష్టిగొరకు- జూచేసభాజనులకు- విభూతిగలుగుటగొరకు- సభానాయకునియొక్క-శ్రేయస్సుగొరకు- నాట్యకర్తయొక్క - ప్రియముగొరకు - రంగభూమియొక్క-శుద్ధ్యతిశయంగొరకు - పాత్రముయొక్క- సంరక్షణంగొరకు- విద్యాశిక్షాగురువుయొక్క-శిక్షసిద్ధించుటందుగొరకు- రంగాధిదేవతయొక్క-పూజనుయాచరించవలయు-

శ్లో॥ ఏతత్సమస్తం విప్రేంద్ర సామవేదే ప్రతిష్ఠితం।

టీ॥ యివిసమస్తంబులు- సామవేదంబునందు- పంచవింశతిబ్రాహ్మణమందు పూర్వరంగము - అవశ్యముగా - చేయవలెనని - జెప్పబడియుండును. ... ... *

పూర్వరంగంబనగా-

శ్లో॥ పదభాగాః కథాశ్చైవ పరివర్తాస్తథైవచ।
యస్మిన్రంగే ప్రయుజ్యంతే పూర్వరంగస్స ఉచ్యతే॥

టీ॥ పదభాగంబులు- కథలు- వ్యావర్తపరివర్తనంబులు- యేరంగంబునందు- ప్రయోగింపబడుతున్నవో - యది - పూర్వరంగంబనబడును- ... ... ... *

పుష్పాంజలిలక్షణమ్-

శ్లో॥ తథా పుష్పాంజలిం కృత్వా రంగమధ్యే విశేషతః।

నృత్తంగీతంచవాద్యంచ దేవాగారే యథాక్రమం॥
రాజస్థానే ప్రవేశేచ మోహనం సర్వసిద్ధిదం।
త్రిలోకరంజనం సేవ్యం భరతంశాస్త్రముత్తమం॥
పుష్పాంజలివినా నాట్యం ద్రష్టుః పాతకకృద్భవేత్।
పుష్పాంజలియుతం నాట్యం మహాదోషనివారణం॥
స్థిత్వాపూర్వవదాచార్యో నర్తకీం ప్రావిశేత్పురః।
సావధానాంజలింబధ్వా కుసుమాంజలిమార్గతః॥
పాత్రాదౌపుష్పమాదాయ పాత్రాంతేచవిసర్జయేత్।

టీ॥ రంగస్థానమునందు- అప్రకారంబుగానం- దేవాగారంబునందు- రాజస్థానంబునందు- నూతనగ్రహప్రవేశమందు- విశేషంబుగాపుష్పాంజలిని- యథాక్రమంబుగా- నృత్త- గీత - వాద్యలును జేసి- మోహనకరంబగు- సమస్తసిద్ధికరంబగు - త్రిలోకంబులకు- అనురంజకంబగు- యుత్తమంబైన- యీభరతశాస్త్రంబు - సేవింపయోగ్యంబై - యుండును- గనుక- నాట్యాచార్యుండు- పూర్వంబోలెనిలిచి - పాత్రమును - ముందు - ప్రవేశింపజేయువలయు- సావధానంబుగా- పుష్పాంజలినిగట్టి - కుసుమాంజలిమార్గంబువల్ల. పాత్రాదియందు- పుష్పంబులను- దీసుకొని- పాత్రాంతమందు- విసర్జనజేయింపవలయు. ... ... *

పుష్ప లక్షణమ్.

శ్లో॥ జపాకుసుమపున్నాగ ద్రోణకేతకిచంపకాః।
జాతీవకుళపుష్పాణి రవివారాదిషుక్రమాత్॥

టీ॥ భానువారమునందు- దాసానపూవ్వులు - సోమవారంబునందు- నాగకేసరిపూవ్వులు - అంగారకవారంబునందు - తుంమిపూవ్వులు- బుధవారమునందు- మొగలిపువ్వరేకలు- గురవారంబునందు- సంపంగిపువ్వలు- శుక్రవారంబునందు- జాజిపువ్వలు- శనివారంబునందు- పొగడపువ్వలు- యీక్రమంబుగా- రవివారాదివారంబులయందు- వారికుసుమంబులను- పాత్రాదియందు-యంజలిబంధంబుజేసి- పాత్రాంతమునందు-పుష్పాంజలినియవ్వవలయు.



శ్లో॥ హరీశగోపతిభ్యశ్చ దిగీశేభ్యస్తథైవచ।
పుష్పాంజలింప్రదాస్యామి తేరక్షంతుసభాపతిః॥

టీ॥ బ్రహ్మవిష్ణుమహేశ్వరులగొరకు- యిదేప్రకారంబుగా - ఇంద్రాద్యష్టదిక్పాలకులగొరకు - పుష్పాంజలిని- యిస్తున్నానో - యాదేవతులు - సభాపతిని - సంరక్షణ- జేయుగాక - యిట్లని-వారపుష్పాంజలిని యిప్పించవలయు. ... ... *

సభానాయకప్రార్థనా-

శ్లో॥ నానాశాస్త్రసరిత్సమేతమమలంఛందఃపయః పూరితం తర్కోక్తిర్విశదోక్తిమౌక్తికచయం వేదాంత
వాక్యామృతమ్। సమ్యఙ్న్యాయసహస్రరత్ననికరంహాస్యఫేనోజ్వలం విద్యాశ్రీజనిభూమిభూత
మపరంవందేసభావారిధిం॥

టీ॥ నానావిధంబులైనశాస్త్రంబులనెడి- నదులు-దోడ- గూడియుండెడి- నిర్మలంబైన- ఛందస్సులనెడి- యుదకంబుచే - పూరితంబగు- తర్క-శాస్త్రంబుయొక్క - యుక్తులవల్ల - విశదంబగు- యుక్తులనెడి - మౌక్తికంబులుయొక్క- సమూహంబుగలిగియుండెడి- వేదాంతవాక్యామృతంబనెడి- యుదకంబుగలిగి - యుండెడి సమీచీనంబులగు- న్యాయంబులనెడి - సహస్రరత్నంబుల యొక్క-సమూహంబుగలిగియుండెడి - హాసంబుయనెడి బేసుగలఫేనంబుచేబ్రకాశిస్తునుండెడి - విద్యయనెడిలక్ష్మికి - యుత్పత్తిస్థానంబగు- సాదృశ్యరహితంబగు - సభయనెడిసముద్రంబునుగురించి నమస్కారంబును జేస్తున్నాను. ... ... *

గ్రంథాంతరే

మూ॥ అంగుళీరహితాకృష్ణాకుండిలావామహస్తికా।
అత్యుచ్ఛాహీనాస్థూలాకృశాపింగళరోమకా॥
విరూపాచైవచాంచల్యాగానాభ్యాసవివర్జితా।
అనక్షరాజనిప్రజ్ఞావ్యాధియుక్తావికారిణీ॥
అతిరక్తాతికృష్ణాచకుండలీపరివర్జితా।
ఏవంగుణోపేతానర్తకీనాట్యవర్జితా॥

టీ॥ అంగుళులులేనదియు-కృష్ణవర్ణంబుమైనదియు-బజ్జరాలైనదియు - యడమహస్త వావిగలిగినదియు - అత్యున్నతరాలైనదియు-పొట్టిరాలైనదియు-బలిశినదియు-కృశరాలైనదియు-పింగళవర్ణంబులైనరోమాలుగలిగినదియు- రూపరహితురాలైనదియు-చపలరాలైనదియు-గానశాస్త్రాభ్యాసరహితురాలైనదియు - అక్షరంబులులేనదియు-ప్రజ్ఞాహీనురాలైనదియు- జాడ్యవంతురాలైనదియు - వికారంబుగలిగినదియు - అతిరక్తవర్ణంబుగలిగినదియు-అతినీలవర్ణ్యంబుగలిగినదియు- నాట్యకుండలిచేత- హీనురాలైనదియు-యీవిధంబులైన-దోషములుగల-నటీ-నాట్యమునకు- వర్జితురాలైయుండును- ... ... ... *

శ్లో॥ అకృత్వాపూజనంపాత్రమాచరేద్యదినాటకం।
తత్పాత్రంనీచమిత్యాహునాట్యశాస్త్రవిచక్షణాః॥

టీ॥ పాత్రరంగదేవతాది- పూజచేయకనె-నాట్యమును- యాచరించినదియైనట్లైతే-యాపాత్రను - నాట్యశాస్త్రవిచక్షణులగువిద్వాంసులు- నీచపాత్రంబని జెప్పుదురు-

శ్లో॥ నీచపాత్రకృతంనాట్యంయదిపశ్యంతిమానవాః।
అపుత్రాఃపశవశ్చైవజాయంతేమృగయోనిషు॥

టీ॥ నీచపాత్రంబుచేత- జేయబడిననాట్యమును - మానవులై



జూచినవారలైనట్లైతే-పుత్రరహితులై-మృగయోనులయందు-పుట్టుదురు- ... ... ... ... *

హీనతాళదోషః

శ్లో॥ తాళమూలానిగానానిసర్వంతాళేప్రతిష్ఠితం।
తాళహీనానిగానానిమంత్రహీనాయథాహుతిః॥
తాళహీనేహరేద్రాజ్యంనాదహీనేజనక్షయః।
ధాతుమాతువిహీనంస్యాద్యోగ్నితంతువర్జయేత్॥

టీ॥ గానంబులు తాళమూలకంబులై యుండునుగనుక - తాళమునందు- సమస్తశ్రేయోమంగళంబులు - యుంచబడినవై యుండును గావున- తాళహీనంబులైన- గానంబులు- మంత్రహీనంబైన-యాహుతిజొప్పున - దోషకరంబులై యుండును - తాళహీనమైన గానము- రాజ్యంబునపహరించును - నాదంబుహీనమైనట్లైతే- జనులయొక్క-నాశంబుగలుగును - యాకారణంబువలన - యీగానము-ధాతువుజేతహీనంబై యుండును - యిటువంటి గానమును- దూరంబుగావర్జింపవలయు. ... *

కింకిణీపతనమునకు-

శ్లో॥ కింకిణీనాట్యమధ్యేతువిస్రస్తాయదిభూతలే।
తద్దోషపరిహారార్థంబ్రాహ్మీంలక్ష్మీముమాంస్మరేత్॥

టీ॥ నాట్యమధ్యమునందు- గజ్జలు- భూతలమునందు- విడిగి-జారినవియైనట్టాయనా- యీదోషంబుయొక్క- పరిహారంబుగాను- సరస్వతీదేవిని- లక్ష్మీదేవిని పార్వతీదేవిని- స్మరించవలయు.

నటనకాలమందుకింకిణీలుతెగినదానికి-

శ్లో॥ నర్తకీపాదకింకిణ్యచ్ఛింద్యత్యఃపతితాయది।
గురుదేవనమస్కారంకృత్వానాట్యంసమాచరేత్॥

టీ॥ నర్తకియొక్క- పాదకింకిణీలు- ఛేదింపబడి భూమియందు-

బడినటువంటిదైనట్టాయెనా- తద్దోషపరిహారార్థంబుగా- గురు దేవనమస్కారంబును జేసి- మరియుధరించి- నాట్యంబును-సలపించు వచ్చును-

నర్తకియొక్క పుష్పంబులుజారిబడుటకు-

శ్లో॥ నర్తకీశిరసః పుష్పంవిస్రస్తంయదిభూతలే॥
తద్దోషపరిహారార్థంవాణీంలక్ష్మీంముమాంస్మరేత్॥

టీ॥ నాట్యకాలంబునందు- నర్తకిధరించియుండెడి- పుష్పంబులు.జారి- భూతలంబునందు- బడినట్లైతే- తద్దోషపరిహారార్థంబుగా-సరస్వతీదేవిని-లక్ష్మీదేవిని- పార్వతీదేవినీ-మనస్సుయందలి స్మరించినటనంబును జేయువచ్చును. ... ✻

నటియొక్క-యాభరణంబులుజారిబడుటకు-

శ్లో॥ నాట్యమధ్యేభూషణాని పతంతియదిభూతలే।
తద్దోషపరిహారార్థం గురుంనత్వాతుధారయేత్॥

టీ॥ నటియొక్క-నాట్యమధ్యంబునందు- యాభరణంబులు-భూమియందు - జారిబడినటువంటిదైనట్లైతే - తద్దోషపరిహారార్థంబుగా- గురువును- నమస్కరించి- యాభరణములనుధరించి-నటనమును - జేయవచ్చును. ... ... ✻

కాళికాఃడిచిచారుటకు.

శ్లో॥ కటిస్థితాకాళికాచ గళితానాట్యమధ్యమే।
గురుదేవనమస్కారం కృత్వానాట్యంసమాచరేత్॥

టీ॥ నటీ- నాట్యమధ్యంబునందు- కటియందుయుండెడి- కాశికా- జారినదైయైనట్లైతే- తద్దోషపరిహారార్థంబుగోరకు- గురుదేవనమస్కారముసాచరించి- నాట్యంజేయువలయు.

కంచుకంబుజారుటకు.

శ్లో॥ కంచుకంనాట్యమధ్యేతు విస్రస్తంయదివక్షసః।
తద్దోషపరిహారార్థం వాణీంలక్ష్మీంముమాంస్మరేత్



టీ॥ నాట్యమధ్యంబునందు- నటియొక్క- కంచుకంబు - వక్షస్థలంబువలన - జారినదియైనట్లైతే - తద్దోషపరిహారార్థంబుగా- సరస్వతీదేవిని- లక్ష్మీదేవిని - పార్వతీదేవిని- స్మరించి- మరియుగట్టుగొని- నర్తనంబు జేయువలయు. ... ✻

వేత్ర పతనమునకు-

శ్లో॥ రుద్రంచహరిధాత్రర్క దేవతాదిగురూన్హృది।
ధ్యాత్వాపతితముధృత్యధారయేద్వేత్రముత్తమం॥

టీ॥ నాట్యమధ్యంబునందు- వేత్రధారియొక్క-- వేత్రంబు-జారిబడినదైనట్లైతే- రుద్రుండు- విష్ణువు- బ్రహ్మయు - సూర్యదేవుండుమొదులగు- దేవతలును - గురువును- హృదయంబునందు- ధ్యానంబుచేసి- బడినయావేత్రంబునుధరించవలయు-

తాళపతనమునకు.

శ్లో॥ తుంబురుంనారదంవిష్ణుంబ్రహ్మాణంచమహేశ్వరమ్।
లక్ష్మీంగౌరీంసమీరంచధ్యాత్వాతాళంసముద్ధరేత్॥

టీ॥ నాట్యమధ్యంబునందు- తాళముబడినట్లైతే - యాదోషపరిహారంబుగోరకు- తుంబురుల- నారదుల - విష్ణువు- బ్రహ్మయు - మహేశ్వరుండు- లక్ష్మియు. గౌరియు- వాయువు- వీరులను- మనస్సుయందు- ధ్యానంబు జేసి-యాబడినతాళమును- ధరింపవలయు.

మృదంగపతనమునకు-

శ్లో॥ నందీశంతునమస్కృత్వామృదంగేపతితేయది।
రంగస్థలేసముద్ధృత్యవాదయేద్బుద్ధిమాన్నరః॥

టీ॥ నటనకాలంబులందు- మృదంగముజారిబడినట్లైతే- యాదోషపరిహారంబుగోరకు- బుద్ధిశాలియైన-మృదంగవాదకుడు-నందీశ్వరున్నిగురించినమస్కారంబు జేసి - రంగస్థలమునందు - యామృదంగంబునుధరించి వాదనమును జేయవలయు-

డును- యీహస్తమును- రాహుగ్రహమునందు వినియోగింపవల
యు-

కేతుగ్రహహస్తలక్షణమ్

శ్లో॥ పతాకంత్రిపతాకంవాదక్షిణేచోర్ధ్వముఖమేల్।
వామహస్తేతుసందంశఃకుంచితస్థానకేస్థితః॥
క్రూరావలోకనంచైవ కేతుహస్తఃప్రకీర్తితః॥

తా॥ దక్షిణహస్తమునందు-పతాకహస్తమునుగాని - అథవా-త్రిపతాకహస్తముగాని - పూర్ధ్వాకారముగాబట్టి వామహస్తమునందు క్రూరదర్శనముగలుగనట్లు-- సందంశహస్తము- స్థానమునందుకుంచితమునుగా- జేయబడితే- కేతుగ్రహహస్తంబనబడును-యీహస్తమును- కేతుగ్రహమునందువినియోగింపవలయు.

గ్రంథాంతరే.

శ్లో॥ వామేకరేతుసూచీస్యాద్దక్షిణేఽర్ధపతాకకః।
కేతుగ్రహకరఃప్రోక్తోభరతాగమవేదిభిః॥

తా॥ వామహస్తమునందు - సూచీముఖహస్తము దక్షిణహస్తమునందు - అర్ధపతాకహస్తము - జేయబడ్డదైతే - యీహస్తము - కేతుగ్రహహస్తంబనబడును - ఈహస్తము కేతుగ్రహమునందు- వినియోగింపవలయు. ... ... ✱

రాక్షసహస్తలక్షణమ్

శ్లో॥ ముఖేకరాభ్యాంశకటోరాక్షసావాంకరస్మృతః।

తా॥ ముఖమునందు - రెండుహస్తములచేత - శకటహస్తముబట్టితే- రాక్షసహస్తంబగును. యీహస్తము రాక్షసుని యందువినియోగింపవలయు. ... ... ... ✱

అథనృత్తహస్తాః

శ్లో॥ అథాతస్సంప్రవక్ష్యామినృత్తహస్తానుసారిణాం।
ఉద్దేశంతుక్రమాత్తేషాంఉద్వృత్తస్తలవక్త్రకః॥



సూచీవిధోరేచితశ్చఅర్ధరేచితపల్లవౌ।
గజదంతోఃప్రకీర్ణఃపశ్చాదావిద్ధవక్త్రకః॥
నితంబఃకేశబంధశ్చలతాఖ్యఃకరిహస్తకః।
దండపక్షశ్చోర్ధ్వమండల్యురోమండలికేతథా॥
పార్శ్వమండల్యురఃపార్శ్వమండలీత్వర్ధమండలీ।
కపోతోమకరశ్చైవజ్ఞానంచవరదాభయమ్॥
ముద్రాహస్తఇతిఖ్యాతోనృత్తహస్తాఃప్రకీర్తితాః॥

తా॥ అనంతరమునందు-- నృత్తహస్తములను - యనుసరించియుండెడి, యాహస్తంబులయొక్క- ఉద్దేశమును - క్రమంబుగా- జెప్పుతున్నాను- ఉద్వృత్తహస్తమనియు తలముఖహస్తమనియు సూచివిధహస్తమనియు - రేచితహస్తమనియు - అర్ధరేచితహస్తమనియు- పల్లవహస్తమనియు- గజదంతహస్తమనియు - ప్రకీర్ణహస్తమనియు- ఆవిద్ధవక్త్రహస్తమనియు - నితంబహస్తమనియు - కేశబంధహస్తమనియు - లతాహస్తమనియు- కరిహస్తమనియు- దండపక్షహస్తమనియు - ఊర్ధ్వమండలీహస్తమనియు-ఉరోమండలీహస్తమనియు- పార్శ్వమండలీహస్తమనియు - ఉరఃపార్శ్వమండలీహస్తమనియు - అర్ధమండలీ హస్తమనియు- కపోతహస్తమనియు- మకరహస్తమనియు- జ్ఞానహస్తమనియు. వరదాభయహస్తమనియు- ముద్రాహస్తమనియు- యీ ౨౪ నృత్తహస్తంబులనిదెలియవలయు . ... ... ... ... ✱

ఉద్వృత్తహస్తలక్షణమ్

శ్లో॥ హంసపక్షకరౌపక్షస్సంముఖత్వముపాశ్రితౌ।
పరస్పరేణవిశ్లేషాత్కరోప్యుద్వృత్తనామకః॥

తా॥ హంసపక్షహస్తంబులు - వక్షస్థలమునందు - యభిముఖముగా- యొకటి-యొకటి-జేరకబట్టితే ఉద్వృత్తహస్తంబనబడును-

వినియోగః

శ్లో॥ ఆవృత్తికపదేహంసదంపత్యోరర్థభావనే।
తిష్ఠేతివచనేడోలాచలనార్థేచమందిరే॥
ఉద్వృత్తహస్తఃకథితో నాట్యశాస్త్రవిశారదైః॥

తా॥ యీఉద్వృత్తహస్తమును యిప్పారుమప్పారుయడుగుబెట్టుటయందును హంసదంపతులనుజూపుటయందును-నిలువుయనెడి వచనమునందును - వుయ్యాలలనూపుటయందును - మందిరమును-జూపుటయందును - వినియోగింపవలయు. ... ... ...

తలవక్త్రిక హస్తలక్షణమ్.

శ్లో॥ కరౌపతాకనామానౌ సమ్ముఖౌతుపరస్పరం।
పునఃపునఃప్రచలితౌ స్మృతస్తలముఖాహ్వయః॥

టీ॥ పతాకహస్తములనుఅన్యోన్యముగాబట్టి - చలింపజేయబడినయైతే - తలముఖహస్తంబనబడును. ...... *

వినియోగః.

శ్లో॥ లుంతనేమత్స్యనటనే ముండనాట్యానుమేళనే।
ఇతస్తతోవ్యక్తిభావే ఖ్యాతస్తలముఖాహ్వయః॥

టీ॥ యీతలముఖహస్తమును-పొర్లాడుటయందును-మత్స్యనటనమునందు- ముండినాట్యమేళనమునందును- యిక్కడ - అక్కడయనెడి- వచనమునందును వినియోగింపవలయు. *

సూచివిద్ధఅస్తలక్షణమ్.

శ్లో॥ అన్యోన్యాభిముఖంశ్లిష్టౌసూచీహస్తాభిధానకౌ।
సూచివిద్ధఇతిప్రోక్తఃనృత్తహస్తవిశారదైః॥

టీ॥ సూచిముఖహస్తములును - అన్యోన్యాభిముఖముగాగూర్చిబట్టితే- సూచివిద్ధహస్తంబనబడును. *



వినియోగః,

శ్లో॥ హల్లీహల్లాస్యనటనేలగ్నార్థేమిళితేదృఢే।
శాఖాద్వయస్యసంఘట్టేసూచీవిద్ధోవియుజ్యతే॥

తా॥ యీసూచీవిద్ధహస్తమును- కోలాట్లువేసుటయందును-వకటొకటిజేరుటయందును- గూడేటియందును-దృఢమునందును కొమ్మకొంమవరుసుటయందును - వినియోగింపవలయు.

రేచితహస్తలక్షణమ్

శ్లో॥ అలపద్మకరౌభ్రాంతౌశీఘ్రంపార్శ్వేప్రసారితౌ।
తత్రప్రయోగకుశలైః రేచితాఖ్యఉదీరితః॥

తా॥ దిప్పబడుతనుండే- అలపద్మహస్తములను - శీఘ్రముగాపార్శ్వంబులయందు- దాచిబట్టితే - రేచితహస్తంబనబడును. ...

వినియోగః.

శ్లో॥ చాలీయ్యానాట్యనటనేనారికేళప్రదర్శనే!
సర్వనాట్యాంతవేళాయాంయుజ్యతే రేచితఃకరః॥

తా ॥ యీరేచితహస్తమును - చాలీయ్యనాట్యముయొక్కనటనమునందును- టెంకాయనుజూపుటయందును- సమస్తనాట్యములయొక్క-విరామసమయమునందునువినియోగింపవలయు.

అర్ధరేచితహస్తలక్షణమ్.

శ్లో॥ ఏతౌతువామభాగస్థౌనామ్నాసావర్ధరేచితః॥

తా॥ యీహస్తంబులును - వామభాగమునందుబట్టితే- అర్ధరేచితహస్తంబనబడును- ... ... *

వినియోగః.

శ్లో॥ అంగహారాఖ్యనటనేచక్రవాకద్వయేపిచ।
అర్ధరేచితహస్తోయంయుజ్యతేకరవేత్తృభిః॥

ను- చక్రవాకయుగ్మంబునందునువినియోగింపవలయు.

పల్లవహస్తలక్షణమ్.

శ్లో॥మణిబంధేసుసంయుక్తౌపతాకౌచావ్యధోముఖౌ।
కించిత్ప్రచలితౌచాగ్రేపల్లవాఖ్యకరస్మృతః॥

తా॥పతాకహస్తంబులును- మణిబంధమునందు- కించిత్కొనలయందు- చలనములగునట్లు- అధోముఖంబులుగాబట్టితే- పల్లవహస్తమనబడును-

వినియోగః,

శ్లో॥ఫలపుష్పేప్రస్తునమ్రాణాంశాఖానాంయోజనాసుచ।
నమ్రీకృతార్థేకాయుజ్యేతపల్లవాభిదహస్తకః॥

తా॥యీపల్లవహస్తమును- ఫలపుష్పంబులుచేత - నమ్రములైయుండెడి- గొమ్మలనుజూపుటయందును- నమ్రములైనవారులను-జూపుటయందునువినియోగింపవలయు- ... ... *

గజదంతహస్తలక్షణమ్,

శ్లో॥కనిష్ఠేద్వేశిఖరయోఃప్రసృతేగజదంతకః॥

తా॥ శిఖరహస్తంబులయందు-కనిష్ఠికాంగుళులను- దాచిబట్టితే- గజదంతహస్తమనబడును. ... ... *

వినియోగః.

శ్లో॥జలావగాహేద్విరదదంతాభ్యాంభూమిఘాతనే।
శంకుస్థాపనభావేచగజదంతోనియుజ్యతే॥

తా॥యీగజదంతహస్తమును- వుదకమునందు - ప్రవేశించుటయందును - యేనుగదంతములచే భూమియందు దరిగూరాడుటయందును-శంకుస్థాపనము-జూపుటయందును-వినియోగింపవలయు

విప్రకీర్ణహస్తలక్షణమ్.

శ్లో॥హస్తౌతుత్రిపతాకాఖ్యౌవిశ్లిష్టౌస్వస్తికాకృతీ।
కథ్యతేవిప్రకీర్ణాఖ్యోన్నత్రక్రమవిశారదైః॥



తా॥ త్రిపతాకహస్తములను- స్వస్తికాకృతిగల్గునట్లు-యదురుగాబట్టితే- విప్రకీర్ణహస్తంబనబడును- ... ... *

వినియోగః.

శ్లో॥ కవచేవకరన్యాసేమంత్రావాహనభావనే।
విప్రకీర్ణకరస్యాత్సూతరపిభిర్యుజ్యతేక్రమాత్॥

తా॥ యీవిప్రకీర్ణహస్తమును - కవచమునందును - కరన్యాసమునందును- మంత్రములయొక్క - ఆవాహనముజేయుటయందును- వినియోగింపవలయు. ... ... ... ... *

ఆవిద్ధవక్రహస్తలక్షణమ్.

శ్లో॥మణిబంధావధిభ్రాంతౌకరౌముకుళనామకౌ।
పునఃపునఃప్రచలితౌహస్తావావిద్ధవక్రకౌ॥

తా॥ముకుళహస్తములును - మణిబంధమే అవధిగాగలుగునట్లు త్రిప్పి- మాటిమాటికిని- చలింపజేసితే- ఆవిద్ధవక్రహస్తంబనబడును-

వినియోగః.

శ్లో॥దేవార్చనేపాదచారినటనేయుజ్యతేక్రమాత్।
ఆవిద్ధవక్రహస్తోయంమనీషిభిరుదాహృతః॥

తా॥ యీఆవిద్ధవక్రహస్తమును- దేవతులయొక్క పూజయందు- పాదచారినటనమునందు- వినియోగింపవలయు-

నితంబహస్తలక్షణమ్.

శ్లో॥అంసదేశాద్వినిర్యాతౌనితంబావధిచాలితౌ।
త్రిపతాకాహ్వయాహస్తౌనితంబఇతికీర్తితః॥

తా॥ త్రిపతాకహస్తములు- భుజప్రదేశమువల్లనుంచిన్ని- నితంబావధిగా- చలింపజేయబడ్డవైతే- నితంబహస్తంబనబడును.

వినియోగః.

శ్లో॥పరిశ్రమేతాంమ్రరుచాదేవావరణభావనే॥

పరచ్ఛాయానిరుంధేశివచనే భ్రమరేపిచ॥
ఉగ్రనాట్యాదిరచనేయుజ్యతేసౌనితంబకః॥

తా॥ యీనితంబహస్తమును-సూర్యచంద్రులయొక్క - పరివేషమునందును- తాంత్రురుచియందును- దేవతులయొక్క- అవరణమునందును- తెరకోకబట్టుయనెడివచనమునందును- భ్రమరములందును-ఉగ్రనాట్యాదులును-చేసుటయందును-వినియోగింపవలయు,

కేశబంధహస్తలక్షణమ్-

శ్లో॥ఎషఎవనితంబశ్చ కేశపర్యంతచాలితః।
కేశబంధఇతిప్రోక్తస్తస్యరూపణముచ్యతే।

తా॥ యీనితంబహస్తము. నితంబముమదులగు- కేశపర్యంతరము- చలింపబట్టితే- కేశహస్తంబనబడును. ... ... *

వినియోగః.

శ్లో॥వృక్షద్వయస్యాభినయేసుమేరోరధఃభావనే।
ఉద్వృత్తేచవచోభావేయుజ్యతే కేశబంధకః॥

తా॥ యీకేశబంధహస్తమును - రెండువృక్షములను-యభినయించుటయందును- సుమేరుపర్వతముజూపుటయందును - జక్కగానిలువుయని జెప్పేవచనమునందును-వినియోగింపవలయు.

లతాహస్తలక్షణం.

శ్లో॥అలపద్మకరాదాగ్రమణిబంధేప్రసారితా।
అనంతరంప్రచలితాలతాఖ్యఃకరఈరితః॥

తా॥ అలపద్మహస్తంబులను . మణికట్టుయందు - ప్రసారితంబులుగాబట్టి. నంతరమునందు - చలింపజేసితే - లతాహస్తంబనబడును.

వినియోగః.

శ్లో॥విద్యుద్భ్రమరనాట్యేచవాయుచాలితకోరకే।
పుష్పితాయాంలతాయాంచలతాహస్తోనియుజ్యతే।



తా॥ యీలతాహస్తమును - విద్యుద్భ్రమరనాట్యమునందును- వాయువుచేత- చలింపబడ్డమొగ్గలుయందును- పుష్పించియుండెడి- లతయందును - వినియోగింపవలయు. ... ... *

కరిహస్తలక్షణమ్.

శ్లో॥వామస్త్రిపతాఖ్యశ్చాంసదేశేనివేశితః।
పద్మకోశోప్యధోవక్త్రః పురస్యాత్కరిహస్తకః॥

తా॥ వామహస్తమును- త్రిపతాకముగాయంసదేశమునందుబట్టి- దక్షిణహస్తమునందు- పద్మకోశమును - యధోవక్త్రముగాబట్టి- పురఃప్రదేశమునందు- జేశితే- కరిహస్తంబనబడును.

వినియోగః.

శ్లో॥గజతుండార్థకేవిష్ణురాజస్యాభినయేపిచ।
కుంజరాభినయేచైవయుజ్యతేకరిహస్తకః॥

తా॥ యీకరిహస్తమును - యేనుగయొక్క- తొండమును జూపుటయందును- గణేశునుజూపుటయందును - గజములునుజూపుటయందును- వినియోగింపవలయు. ... ... ...

దండపక్షహస్తలక్షణమ్.

శ్లో॥వ్యావృత్తపరివృత్తాభ్యామంసదేశాన్ముఖాగ్రతః।
భ్రామితావలపద్మాఖ్యాదండపక్షఇతీరితః॥

తా॥ అలపద్మహస్తములు - ఆవృత్తపరివృత్తంబులతోడను- అంసప్రదేశంబువల్లనుంచి - ముఖముయొక్క అగ్రభాగమునందుబట్టి- చలింపజేయబడినవైతే-దండపక్షహస్తంబనబడును.

వినియోగః.

శ్లో॥పక్షిణాంచలనేపుష్పాంజలినాట్యప్రదర్శనే।
దండవత్సాభిధస్యోయంయుజ్యతేశాస్త్రవేదిభిః॥

తా॥ యీదండపక్షహస్తమును- పక్షులయొక్కచలనమునం

దున్ను- పుష్పాంజలినాట్యమునుజూపుటయందును - వినియోగింపవలయు.

ఊర్ధ్వమండలీహస్తలక్షణమ్

శ్లో॥ అరాళాఖ్యకరౌచోర్ధ్వభాగేచేత్ప్రసృతౌవతౌ।
పూర్ధ్వమండలికాహస్తః ప్రోచ్యతేభరతాదిభిః॥

తా॥ అరాళహస్తములను- పూర్వభాగమునందు-జాచిబట్టినట్లైతే- పూర్ధ్వమండలీహస్తంబనబడును. ... ... *

వినియోగః,

శ్లో॥ శుకద్వయస్యగమనే ప్రళయస్యనిరూపణే।
పూర్వమండలికాహస్తోయుజ్యతేకరవేదిభిః॥

తా॥ యీపూర్ధ్వమండలీహస్తమును - రెండుచిలుకలయొక్క గమనమునందును- ప్రళయమునుజూపుటయందును- వినియోగింపవలయు.

ఉరోమండలీహస్తలక్షణమ్.

శ్లో॥ వక్షసస్సంమ్ముఖేనాతౌచలితౌచపునఃపునః।
ఉరోమండలికాహస్తః ప్రోచ్యతేకరవేత్తృభిః॥

తా॥ అరాళహస్తములరెండును- వక్షస్సుకుయెదిముఖంబులుగాబట్టి- చలింపచేయబడితే- ఉరోమండలీహస్తంబనబడును. ... *

వినియోగః.

శ్లో॥ క్రౌంచానాంగమనేచాపిఖంజరీటగతిక్రమే॥

తా॥ యీపురోమండలిహస్తమును- క్రౌంచపక్షులయొక్క-గమనమందున్ను- ఖాటుకపక్షులయొక్క గమనక్రమమునందును-వినియోగింపవలయు. ... ... ... ... ... *

పాశ్వమండలీహస్తలక్షణమ్.

శ్లో॥ ఏతావిహిపాశ్వద్వితయేపర్యాయాత్సముపాగతౌ।
పాశ్వమండలికాహస్తః ప్రోచ్యతేభరతాగమే॥

తా॥ యీరెండుఅరాళహస్తంబులును - పుభయపాశ్వంబులయందు- బట్టబడి - క్రమంబుగాచేర్చితే - పాశ్వమండలీహస్తమనబడును.

వినియోగః.

శ్లో॥ కపోతానాంచగమనేనాగానాంకన్యకాసుచ।
పాశ్వమండలికాహస్తః ప్రోచ్యతేభరతాదిభిః॥

టీ॥ యీపాశ్వమండలీహస్తమును- కపోతపక్షులయొక్క-గమనమందును- నాగకన్యకలయందును- వినియోగింపవలయు,

ఉరఃపాశ్వమండలీహస్తలక్షణమ్

శ్లో॥ పద్మకోశాభిధాహస్తౌపురోదేశసమాశ్రితౌ।
వ్యావృత్తచలితాకారాపురఃపాశ్వ ఇతిస్మృతః॥

తా॥ రెండుపద్మకోశహస్తములను- పురఃప్రదేశమునందుబట్టి వ్యావృత్తచలితంబులగునట్లుబట్టితే - ఉరఃపాశ్వమండలీహస్తంబనబడును.

వినియోగః

శ్లో॥ నాళేవపద్మయుగళేమమోహక్త్యాంచవిశేషతః।
ముఖనాట్యానుయోగేషియుజ్యతేపూర్వసూరిభిః॥

తా॥ పురఃపాశ్వమండలీహస్తమును - తామరదంటుయందును- పద్మములయొక్కజంటయందును- మమకారంబైన వచనమునందును-ముఖనాట్యమునుజూపుటయందును - వినియోగింపవలయు.

అర్ధమండలీహస్తలక్షణమ్.

శ్లో॥ ఏకంవక్షస్థలేస్థాప్యఅన్యఃపాశ్వే ప్రసారితః।
వ్యావర్తితంచాలపద్మమర్ధమండలికాభిదః॥

తా॥ వకఅలపద్మహస్తమును - వక్షస్థలమునందుబట్టి - రెండవఅలపద్మహస్తమును- పార్శ్వమందు-విస్తృతంబుగాబట్టి - వ్యావర్తముగాశేసితే- అర్ధమండలీహస్తమనబడును.

వినియోగః.

శ్లో॥ నారికేళేచూతఫలేకృష్ణేపర్వతధారణే।

తా॥ ఈ యర్ధమండలీహస్తమును- నారికేళఫలమును - జూపుటయందును-తియ్యమామిడిఫలమును-జూపుటయందును - కృష్ణునియందును-పర్వతమునుధరించుటయందును-వినియోగింపవలయు

కపోతహస్తలక్షణమ్.

శ్లో॥ దక్షిణాఖ్యఃకరఃపూర్వంసపర్ణశీర్షకరాశ్రితః।
తస్యపృష్ఠేసంయుమితఃపూర్వవద్వామహస్తతః॥
ప్రసృతేऽగ్రేకపోతోऽయంకీర్తితోనాట్యవేదిభిః॥

తా॥ దక్షిణహస్తమునందు- సపర్ణశీర్షహస్తమునుబట్టి - వామహస్తమునందు-అదేచొప్పున-సర్పశీర్షహస్తమునుబట్టి-దక్షిణహస్తముయొక్క పృష్టభాగమునందు- చేర్చి - అగ్రభాగములను- విస్తరింపచేసితే- కపోతహస్తమనబడును. ... ... ...

వినియోగః.

శ్లో॥ కపోతద్వంద్వభావేపిసర్పయోర్మేళనేపిచ।
కపోతోऽయంసమాఖ్యాతఃకరయోగవిశారదైః॥

తా॥ ఈ కపోతహస్తమును- కపోతపక్షులయొక్క - జంటను జూపుటయందును- సర్పంబులయొక్క మేళనమునందును. వినియోగింపవలయు. ... ... ... ... *

మకరహస్తలక్షణం.

శ్లో॥ అస్మిన్నేవచలాంగుష్ఠఃకథితోమకరాభిధః।

తా॥ ఈ కపోతహస్తమునందు - యంగుష్ఠంబులు - చలించెటట్టుబట్టితే- మకరహస్తమనబడును. ......................*

వినియోగః.

శ్లో॥ మకరేతుసమాఖ్యాతోమత్స్యభావేవిశేషతః॥

తా॥ ఈ మకరహస్తమును - మకరమునందును-మత్స్యంబులను జూపుటయందును-వినియోగింపవలయు...............*



జ్ఞానహస్తలక్షణమ్.

శ్లో॥ పతాకోపరివిన్యస్తఃహంసాస్యోర్ధ్వముఖఃకరః।
జ్ఞానహస్తస్సకథితోకరభావవిచక్షణైః॥

తా॥ పతాకహస్తమును - నాభిప్రదేశంబునందు - క్రిందుతలముగలుగునట్లుబట్టి- యీహస్తముపైదక్షిణహస్తముచేత - హంసాస్యహస్తమునుబట్టి- ఊర్ధ్వముఖంబుగాజేసితే- జ్ఞానహస్తమనబడును-

వినియోగః.

శ్లో॥ నిర్మోహానాంభావనాసుశాంతనామ్నిరసోదయే।
హృదయధ్యానభావేచజ్ఞానహస్తోనియుజ్యతే॥

తా॥ ఈ జ్ఞానహస్తము- మమతలేనివానిజూపుటయందు-శాంతరసమునందు-హృదయమునందుండెడిపరమాత్మధ్యానమునందు-వినియోగింపవలయు. ... ... ... ... ... *

వరదాభయహస్తలక్షణం.

శ్లో॥ వామఃపతాకోర్ధ్వభాగదక్షిణశ్చాప్యధోముఖః।
భుజేకుక్షౌక్రమాత్కృత్వావరదాభయహస్తకః॥

తా॥ వామహస్తముచేత- పతాకహస్తమునుబట్టి - ఊర్ధ్వముఖంబుగాజేసి - దక్షిణహస్తముచేత - పతాకహస్తమునుబట్టి - యధోముఖంబుగాచేసి- క్రమంబుగా- వామహస్తమును- భుజప్రదేశమునందు- దక్షిణహస్తమును- కుక్షిప్రదేశంబునందు- నిలిపితే వరదాభయహస్తంబనబడును. ... ... ... ... *

వినియోగః

శ్లో॥ క్షిత్యాఃప్రదర్శనేసమ్యగ్వేంకటేశనిరూపణే।
తారాణాంపతనేచైవతస్యరూపణముచ్యతే॥

తా॥ ఈ వరదాభయహస్తమును-భూమినిజూపుటయందును-వేంకటేశునిజూపుటయందును - నక్షత్ర పతనమునుజూపుటయం

దుసు- వినియోగింపవలయు. ... ... *

మున్ద్రాహస్తలక్షణమ్.

శ్లో॥ మధ్యమాంగుష్ఠయోర్యోగశ్శేషాంగుళ్యః ప్రసారితాః।
మున్ద్రాహస్తస్సమాఖ్యాతః కరన్యాసవిచక్షణైః॥

తా॥ మధ్యమాంగుష్ఠములు-సంయుక్తంబులుగాబట్టి- నిలచిన యంగులులను-ప్రసారణముగాబట్టితే-మున్ద్రాహస్త మనబడును-

వినియోగః.

శ్లో॥ అణురిత్యర్థకే ధేనోరానసే తృణభావనే।
చిన్ముద్రాయాంచ చంచ్వర్థే ముద్రాహస్తో నియుజ్యతే॥

తా॥ యీముద్రాహస్తమును- అణుయని జెప్పుటయందును-గోవు యొక్క ముఖమునందును - తృణము యని జెప్పుట యందును- చిన్ముద్రను జూపుటయందును- త్రోటీపుటంబులయందును- వినియోగింపవలయు. ... ... *

ఇతినృత్తహస్తాః

అథబాంధవహస్తాః

మాతృహస్తలక్షణమ్.

శ్లో॥ వామేతు శిఖరంకృత్వా దక్షిణే మృగశీర్షకం॥
మాతార్థే వినియుజ్యేత కీర్తితో భరతాదిభిః॥

తా॥ వామహస్తమునందు-శిఖరహస్తమును చేసి - దక్షిణహస్తమునందు- మృగశీర్షహస్తముబట్టితే- మాతృహస్తంబనబడును- యీహస్తము తల్లియందు వినియోగింపవలయు. ... *

పితృహస్తలక్షణమ్

శ్లో॥ ఏతావేతౌ విపరీతౌ చేత్పిత్రార్థే వినియుజ్యతే॥

తా॥ ఆయీరెండుహస్తములను విపరీతంబులుగాబట్టితే-పితృహస్తంబనబడును- యనగా వామహస్తమునందు- మృగశీర్షహస్త



మును బట్టి దక్షిణహస్తమునందు- శిఖరహస్తమును బట్టి - తండ్రిని జూపవలయు- ... ... *

పితామహహస్తలక్షణమ్

శ్లో॥ సందంశస్త్వళికే భాగే చలితో విరళో యది।
పితామహే నియుజ్యేత శివేన పరికీర్తితః॥

తా॥ సందంశహస్తమును - లలాటప్రదేశంబునందు-బట్టి- చలనంబును జేసి విరళంబుగాబట్టితే- తాతయందు వర్తించును-

పితామహీహస్తలక్షణమ్

శ్లో॥ అలపద్మః కంఠదేశే కృత్వాపి చలితో యది।
పితామహ్యాం నియుజ్యేత కథితో భరతాదిభిః॥

తా॥ అలపద్మహస్తము- కంఠదేశంబునందు- జేయబడి-చలింప జేయబడినదైతే-అవ్వయందు వర్తించును. ... *

పుత్రీపుత్రహస్తలక్షణమ్

శ్లో॥ వామహస్తే సర్పశీర్షం మృగశీర్షం తతోపరి।
విన్యసేత తత్పుత్రాయాంచ సుతేపి వినియుజ్యతే॥

తా॥ వామహస్తమునందు- సర్పశీర్షహస్తమును బట్టి దానిపై మృగశీర్షహస్తంబును-వుంచితే- పుత్రియందును-పుత్రుని యందును వర్తించును. ... ... *

జామాతృహస్తలక్షణమ్

శ్లో॥ మయూరో దక్షిణే హస్తే భ్రమరో వామహస్తకే।
జామాతరి నియుజ్యేత కరకర్మవిశారదైః॥

తా॥ దక్షిణహస్తమునందు-మయూరహస్తము- వామహస్తమునందు-భ్రమరహస్తము జేయబడితే-అల్లునియందు వర్తించును-

శ్వశ్రూహస్తలక్షణమ్

శ్లో॥ పతాక...

శ్వశురార్థేనియుజ్యేతనందినాపరికీర్తితః॥

తా॥పతాకహస్తముయొక్క - పృష్ఠభాగము - యడ్డముగాబట్టి
నట్లైతే - మామయందువర్తించును. ... ... ... *

శ్వశ్రూహస్తలక్షణమ్.

శ్లో॥పతాకముదరేకృత్వావామేచాప్యలపద్మకం।
శ్వశ్ర్వాంచపరియుజ్యేతకథితోభరతాదిభిః॥

తా॥ పతాకహస్తమును-వుదరమందుచేర్చి- వామహస్తమునం
దు- అలపద్మహస్తమునుబట్టితే- అత్తయందువర్తించును. *

స్నుషాహస్తలక్షణం.

శ్లో॥ పతాకేనభువందర్శ్య వామహస్తేర్ధచంద్రకం।
స్నుషాయాంచప్రయోక్తవ్యంకోహళేనప్రకీర్తితం॥

తా॥పతాకహస్తముచేత- భూమినిజూపించి - వామహస్తమం
దు- యర్ధచంద్రహస్తమునుబట్టితే- కోడలుయందువర్తించును.

భగినీహస్తలక్షణం

శ్లో॥ దక్షిణేహంసపక్షంచవామేలాంగూలకంతథా॥
స్వసారంప్రతియుజ్యేతేత్యాంజనేయేనచోదితం॥

తా॥ దక్షిణహస్తమునందు - హంసపక్షహస్తమును - అక్షేప
కారంబుగా- వామహస్తమునందు- లాంగూలహస్తమునుబట్టితే-
తోడపుట్టుయందు- వర్తించును- ... ... ... *

శ్యాలకహస్తలక్షం.

శ్లో॥కటకాముఖహస్తేనతామ్రచూడశ్చదర్శితః।
శ్యాలకేతుప్రయుజ్యేతేత్యాచార్యేణప్రచోదితం॥

తా॥ కటకాముఖహస్తముదోడను, తామ్రచూడహస్తముజూ
పబడితే- భావయందువర్తించును. ... ... ... *



ననాందాహస్తలక్షణం

శ్లో॥శుకతుండోదక్షిణేచముకుళోవామహస్తకే।
ననాందాయాంప్రయుజ్యేతపార్వత్యాపరికీర్తితం॥

తా॥ దక్షిణహస్తమునందు- శుకతుండహస్తము- వామహస్త
మునందు-ముకుళహస్తముబట్టితే-వదినమరదలుయందువర్తించును

దౌహిత్రనప్తృహస్తలక్షణం.

శ్లో॥మృగశీర్షస్త్రియాగాని వామేహంసాస్యహస్తకః।
దౌహిత్రనప్త్రోర్యుజ్యేతేత్యగస్త్యేనప్రకీర్తితం॥

తా॥ దక్షిణహస్తమునందు - మృగశీర్షహస్తము - వామ
హస్తమునందు- హంసాస్యహస్తముబట్టితే - దౌహిత్ర-ప్రపౌత్ర
లయందువర్తించును. ... ... ... ... ... *

భ్రాతృభగినీహస్తలక్షణమ్.

శ్లో॥సూచీహస్తస్త్వంశదేశేకుంచితోవీక్షితోయది।
భగిన్యాంసోదరేచైవయుజ్యతేభరతాగమే॥

తా॥ భుజప్రదేశమునందు- సూచిహస్తము- వంచబడి - జూ
డబడినట్లైతే- భగినియందును- సోదరునియందును-వర్తించును,

అథచాతుర్వర్ణ్యహస్తాః.

బ్రాహ్మణవర్ణహస్తలక్షణమ్.

శ్లో॥కరాభ్యాంశిఖరంధృత్వాయజ్ఞసూత్రప్రదర్శనే।
దక్షిణేనకృతేతిర్యగ్బ్రాహ్మణానాంప్రదర్శితః॥

తా॥ రెండుకరంబులచేత- శిఖరహస్తమునుబట్టి- దక్షిణహస్త
ము- చేతయడ్డముగా- వుపవీతముయొక్క - దర్శనము- జూపిం
పబడినట్లైతే- బ్రాహ్మణవర్ణముయందువర్తించును-

క్షత్రియవర్ణహస్తలక్షణం.

శ్లో॥ వామేనశిఖరంతిర్యగ్ధృత్వాన్యేనపతాకకః।

ధృతో౽యదిక్షత్రియాణాంహస్తఇత్యభిధీయతే॥

తా॥ వామహస్తముచేత-శిఖరహస్తమును యడ్డముగాబట్టి-దక్షిణహస్తముజేత-పతాకహస్తముధరింపడినదైతే-క్షత్రియవర్ణహస్తంబనబడునుయీహస్తముక్షత్రియవర్ణంబునందువర్తించును.

వైశ్యవర్ణహస్తలక్షణం-

శ్లో॥ వామేకరేతుహంసాస్యోదక్షిణేకటకాముఖః।
వైశ్యహస్తాయమాఖ్యాతో భరతాగమవేదిభిః॥

తా॥ వామహస్తమునందు - హంసాస్యహస్తము - దక్షిణహస్తమునందు- కటకాముఖహస్తము- చేయబడినదైతే-వైశ్యవర్ణహస్తంబనబడును- యీహస్తము - వైశ్యవర్ణంబునందువర్తించును. ...

శూద్రవర్ణహస్తలక్షణం

శ్లో॥ వామేతుశిఖరంసూచీదక్షిణేశూద్రహస్తకః।

తా॥ వామహస్తమునందు-శిఖరహస్తము- దక్షిణహస్తమునందు- సూచీహస్తము- బట్టినట్లైతే- శూద్రవర్ణహస్తంబనబడును. యీహస్తము-శూద్రవర్ణమునందువర్తించును- ... *

ఇతిచాతుర్వర్ణ్యహస్తాః

అథశిరోభేదాః.

శ్లో॥ ధుతంవిధుతమాధూతమవధూతంచకంపితం।
ఆకంపితోద్వాహితేచపరివాహితకాంచితే॥
నిహంచితంపరావృత్తముత్క్షిప్తాధోముఖేతథా।
లోళితంచేతివిజ్ఞేయంచతుర్దశవిధంశిరః॥
తిర్యఙ్నతోన్నతంసరంధానతమారాత్రికంసమం।
పార్శ్వాభిముఖమిత్యన్యద్భేదంపంచపరేజగుః॥
సౌమ్యమాలోళితంచైవతిరశ్చీనంప్రకంపితం।
సౌందరంపంచధాప్రోక్తంశిరసాంలక్షణంతథా॥



టీ॥ ధుతమనియు- విధుతమనియు- ఆధూతమనియు. అవధూతమనియు- కంపితమనియు- ఆకంపితమనియు- ఉద్వాహితమనియు పరివాహితమనియు- అంచితమనియు- నిహంచితమనియు - పరావృత్తమనియు- ఉత్క్షిప్తమనియు- అధోముఖమనియు - లోళితమనియు- ౧౪- తిర్యఙ్నతోన్నతమనియు-సరంధానతమనియు - ఆరాత్రికమనియు- - సమమనియు- పార్శ్వాభిముఖమనియు- ౫ - సౌమ్యమనియు- ఆలోళితమనియు- తిరశ్చీనమనియు - ప్రకంపితమనియు-సౌందరమనియు- ౫- ౨౪శిరోభేదాలుజెప్పబడియుండును.

ధుతశిరోలక్షణం.

శ్లో॥ వామదక్షిణభాగేతుచలితంతద్ధుతంశిరః॥

తా॥ వామదక్షిణభాగంబులయందు- చలింపజేయబడినది-యదియో- అది ధుతశిరస్సనబడును. ... ... ... *

వినియోగః,

శ్లో॥ నాస్తీతివచనేభూయః పార్శ్వదేశావలోకనే।
[illegible]॥
ప్రతిషేధేచతస్యోక్తఃప్రయోగో భరతాదిభిః।

తా॥ లేదుయనెడివచనమునందును-మాటిమాటికి పార్శ్వప్రదేశంబులయొక్క జూచుటయందును- జనులయొక్కసమాధానం లేకబోవుటయందును- విస్మయమునందును- దుఃఖమునందును- యిష్టంకాకబోనిదానియందు - వొద్దుఅనిజెప్పేవచనమునందును? వినియోగింపవలయు. ... ... ... ... ... *

విధుతశిరోలక్షణమ్

శ్లో॥ ద్రుతగత్యాధుతద్యస్మాద్విధుతంతత్ప్రయుజ్యతే॥

టీ॥ యాధుతశిరస్సు - ద్రుతగతిగలిగినదైతే - విధుతశిరస్సనబడును. ... ... *

వినియోగః.

శ్లో॥ సీతార్తేజ్వరితేపిస్యాత్సద్యఃపీతాసవేతథా॥

టీ॥ సీతముజేపీడితుడగువానిజూపుటయందును - జ్వరపీడితుడగువానిజూపుటయందును- సద్యఃపానముజేసినవాని-జూపుటయందును-వినియోగింపవలయు- ... ... *

ఆధూతశిరోలక్షణమ్

శ్లో॥ ఆధూతంతుసకృత్తిర్యగూర్ధ్వంనీతంశిరోమతం॥

టీ॥ వక్రావర్తిపొట్టగాద్రిప్పివూర్ధ్వభాగమును బొందింపబడిన-శిరస్సు - ఆధూతశిరస్సనియనబడును- ... *

వినియోగః.

శ్లో॥ గర్వేణస్వాంగవీక్షాయాం పార్శ్వస్థోర్ధ్వనిరీక్షణే।
శక్తోస్మీత్యభిమానేచప్రయోగస్తైనచోదితః॥

టీ॥ గర్వముజేత-తనయొక్క-దేహమునుజూచుకొనుటయందును-పార్శ్వభాగమునందుండెడి-వస్తువులయొక్క-వూర్ధ్వభాగమునుజూపుటయందును- నేనసమర్థుండనైడే-యభిమానమునందు ఆధూతశిరస్సునువినియోగింపవలయు. ...

అవధూతశిరోలక్షణమ్

శ్లో॥ యదధస్సకృతానీతమవధూతంతదుచ్యతే॥

టీ॥ వక్రావర్తి - అధోభాగమునుబొందింపబడినది - యేశిరస్సు- యాశిరస్సుఅవధూతశిరస్సుయనుబడును- ... ...

వినియోగః.

శ్లో॥ స్థిత్యర్థంచదేశనిర్దేశేప్రశ్నేసంజ్ఞోపదేశయోః।
ఆలాపేచప్రయోక్తవ్యమిగమూహాలుమర్హనీషిణః॥

టీ॥గూర్చుండగోరక-స్థానముజూపుటయందును ప్రశ్నయందును-సంజ్ఞయందును - ఉపదేశమునందును - ఆలాపమునందును



అవధూతశిరస్సును-ప్రయోగింపవలయు- ... ... ... *

కంపితశిరోలక్షణం.

శ్లో॥బహుశోద్ధృతమూర్ధ్వంచకంపనాత్కంపితంశిరః।

టీ॥ శీఘ్రింబుగా- యనేకావర్తులు- ఊర్ధ్వప్రదేశంబు- కంపింపజేయబడిన- శిరస్సుకంపితశిరస్సుయనబడును. ... *

వినియోగః.

శ్లో॥ జ్ఞానాభ్యుపగమేకోపే వితర్కేతర్జనేతథా।
త్వరితప్రశ్నవాక్యేచ ప్రయోక్తవ్యమిదంశిరః॥

టీ॥ జ్ఞానమునందు - అంగీకరించుటయందు- కోపమునందు- సంశయమునందు- బెదరించుటయందు- తీవ్రమనుటయందు- ప్రశ్నవాక్యయందు- యీకంపితశిరస్సును- ప్రయోగింపవలయు.

ఆకంపితశిరోలక్షణమ్.

శ్లో॥ ఆకంపితంతజేతత్స్యాద్విరుక్తంతుశనైర్యది॥

టీ॥ యాకంపితశిరస్సును- రెండావర్తులు- సూక్ష్మంబుగా- కదలింపజేశితే- ఆకంపితశిరస్సుయనబడును. ... *

వినియోగః.

శ్లో॥ పురఃప్రస్థితనిర్దేశే ప్రశ్నేసంజ్ఞోపదేశయోః॥
ఆవాహనేస్వమనసి కథనేతత్ప్రయుజ్యతే॥

టీ॥ యదురుగానుండెడివస్తువును జూపుటయందును - ప్రశ్నయందును- సంజ్ఞజేసుటయందును - వుపదేశమునందును - దేవతాద్యావాహనమునందును- స్వాభిప్రాయమును- జెప్పుటయందును- యీయాకంపితశిరస్సును- వినియోగింపవలయు. ... *

ఉద్వాహితశిరోలక్షణమ్.

శ్లో॥ సకృదూర్ధ్వంశిరోనీతముద్వాహితముదీరితం॥

టీ॥వక్రావర్తిఊర్ధ్వభాగమునుబొందింపబడ్డశిరస్సు- వుద్వా

హితశిరస్సుయనబడును. ... ... ... *

వినియోగః.

శ్లో ॥ శక్తోహమితి కార్యేస్మిన్నభిమానేప్రయుజ్యతే॥

టీ ॥ యీకార్యమునందు- నేనుసమర్థుఁడ నేడి- యభిమానమునందు- యీఉద్వాహితశిరస్సును- వినియోగింపవలయు.

పరివాహితశిరోలక్షణమ్.

శ్లో ॥ పరంమండలికాకారం భ్రామితంపరివాహితం॥

టీ॥ మిక్కిలిమండలాకారంబుగా- ద్రిప్పబడినశిరస్సు - పరివాహితశిరస్సు- యనబడును. ... ... ... *

వినియోగః

శ్లో ॥ లజ్జాభారేభ్రమేమానే వల్లభానుకృతౌతథా।
విస్మయేచస్థితేహర్షే రోషేచాపిప్రమోదనే॥
విచారేచవిచారజ్ఞాః కార్యమాహురిదంశిరః।

టీ ॥ లజ్జాతిశయమునందు- భ్రమయందు- మానమునందు- ప్రియుని యొక్క- వాక్యాంగీకారమునందు- ఆశ్చర్యమునందు- చిరునవ్వుయందు- సంతోషమునందు - రోషమునందు- సంతోషమును బెట్టుటయందు- విచారణయందును- యీపరివాహితశిరస్సును- వినియోగింపవలయు. ... ... *

అంచితశిరోలక్షణమ్.

శ్లో ॥ శిరఃస్యాదంచితంకించిత్పార్శ్వయోర్నతకంధరం॥

టీ ॥ ఉభయపార్శ్వములందు- నమ్రంబైన- కంఠముగలగునట్లు- వంచబడ్డశిరస్సు- అంచితశిరస్సుయనబడును. *

వినియోగః

శ్లో॥బుక్చింతామోహమూర్ఛాసుతత్కార్యమనుధారణే॥

టీ ॥ రోగమునందు- చింతయందు-మోహమునందు- మూర్ఛయందు- తత్కాలోచిత- కార్యమునుధరించుటయందు- యీఅంచితశిరస్సును వినియోగింపవలయు. ... *



నిహంచితశిరోలక్షణమ్.

శ్లో ॥ విక్షిప్తబాహుశిఖరం మగ్నగ్రీవంనిహంచితమ్॥

టీ ॥ పైకియెత్తబడ్డభుజశిరస్సులుగల- మగ్నంబైన - కంఠముగలశిరస్సు- నిహంచితశిరస్సుయనబడును. ... *

వినియోగః

శ్లో ॥ విలాసేలలితేగర్వే బిబ్బోకేకిలకించితే।
మొట్టాయితేకుట్టమితే మానేస్తంభేచతద్భవేత్॥

టీ ॥ విలాసము- లలితము- గర్వము- బిబ్బోకము- కిలకించితము- మొట్టాయితము- కుట్టమితము- మానము- స్తంభము- యనెడి- స్త్రీలుయొక్క- శృంగారభావక్రియలయందు- యీనిహంచితశిరస్సును- వినియోగింపవలయు- యీశృంగారభావక్రియలుయొక్క- లక్షణంబులు- భావప్రకరణమునందుజెప్పబడియుండును. *

పరావృత్తశిరోలక్షణమ్.

శ్లో ॥ పరాఙ్ముఖీకృతంశీర్షం పరావృత్తముదీరితం॥

టీ ॥ పరాఙ్ముఖముగాజేయబడిన - శిరస్సు - పరాఙ్ముఖశిరస్సుయనబడును. ... ... ... ... ... *

వినియోగః-

శ్లో । తత్కార్యేకోపలజ్జాది కృతేవక్త్రప్రసారణే।
పరావృత్తానుసరణే పృష్ఠతఃప్రేక్షణేతథా॥
అనాదరేకచేతూర్శ్యాం పరావృత్తశిరోభవేత్।

టీ ॥ అట్లనేజేయమనుటయందును- కోపము- లజ్జా- మొదలైనవాట్లయందును- ముఖమును- దాచుటయందును - ఉపేక్షయందును- వెంట్రుకలనుజూపుటయందు - అంబులుపాదజూపుటయందు

సు- పరావృత్తశిరస్సును- వినియోగింపవలయు. ... *

ఉత్క్షిప్తశిరోలక్షణమ్.

శ్లో॥ఊర్ధ్వవక్త్రం శిరో జ్ఞేయముత్క్షిప్తం తత్ప్రయుజ్యతే॥

టీ॥ పైకియెత్తబడ్డ ముఖముగల శిరస్సు ఉత్క్షిప్తశిరస్సు యనబడును. ... ... ... ... ... ... ... *

వినియోగః-

శ్లో॥దర్శనేతుంగవస్తూనాం చంద్రాదివ్యోమగామినాం॥

టీ॥ ఉన్నతమైనవస్తువులయొక్క-జూచుటయందు - చంద్రుడు మొదలగు అంతరిక్షమునందు సంచారము చేస్తునుండెడివాళ్లయొక్క- జూచుటయందు- యీఉత్క్షిప్తశిరస్సు వినియోగింపవలయు. *

అధోముఖశిరోలక్షణమ్.

శ్లో॥ అధోముఖస్థితంచాపిశిరఃప్రాహురధోముఖం।

టీ॥ అధోముఖంబుగాయుండెడి - శిరస్సు - అధోముఖశిరస్సు యనబడును.

వినియోగః.

శ్లో॥ లజ్జాదుఃఖప్రణామేషుస్యాదన్వర్థమధోముఖం।

టీ॥ లజ్జయందు- దుఃఖమునందు- నమస్కారమునందు - అన్వర్థనామధేయముగల యీయధోముఖశిరస్సును - వినియోగింపవలయు.

లోళితశిరస్సులక్షణం.

శ్లో॥ శిరస్తల్లోళితంగర్వాధిక్యాచ్ఛిథిలలోచనం॥

టీ॥ గర్వాధిక్యమువలన - శిథిలంబులైన - నేత్రంబులుగలదియేశిరస్సో- యాశిరస్సు లోళితశిరస్సుయనబడును. *

వినియోగః

శ్లో॥ నిద్రాగదగ్రహావేశ మదమూర్ఛాసులోళితం॥

టీ॥ నిద్రయందు- రోగమునందు - గ్రహావేశమునందు- మదమునందు-మూర్ఛయందు-యీలోళితశిరస్సునువినియోగింపవలయు



తిర్యఙ్నతోన్నతశిరస్సులక్షణమ్.

శ్లో॥ తిర్యఙ్నత్యున్నతిప్రాప్తం శిరస్తిర్యఙ్నతోన్నతమ్.

టీ॥ అడ్డముగానమ్రోన్నతులనుబొందినశిరస్సు- తిర్యఙ్నతోన్నతశిరస్సుయనబడును. ... ... ... ... ... *

వినియోగః.

శ్లో॥బిబ్బోకాదిషుకాంతానాంతత్ప్రయోజ్యంప్రచక్షతే॥

టీ॥ స్త్రీలయొక్క- బిబ్బోకముమొదలగు- శృంగారచేష్టలయందు- యీతిర్యఙ్నతోన్నతశిరస్సును- వినియోగింపవలయు.

స్కంధానతశిరోలక్షణమ్.

శ్లో॥స్కంధానతంతదాఖ్యాతంస్కంధేయన్నిపాతంశిరః॥

టీ॥ భుజశిరస్సుయందు- వుంచబడ్డదియేశిరస్సో- యాశిరస్సు స్కంధానతశిరస్సుయనబడును. ... ... ... ... *

వినియోగః

శ్లో॥తన్నిద్రామదమూర్ఛాసుచింతాయాంచప్రయుజ్యతే॥

నిద్రయందు- మదమునందు- మూర్ఛయందు - చింతయందు - ఆస్కంధానతశిరస్సును- వినియోగింపవలయు. ... ... *

ఆరాత్రికశిరోలక్షణమ్.

శ్లో॥ స్కంధాత్కించిదాశ్లిష్యభ్రాంతమారాత్రికంసమం॥

టీ॥ భుజశిరస్సులను- కొంచముగా- తగిలి- త్రిప్పబడినశిరస్సు ఆరాత్రికశిరస్సుయనబడును. ... ... ... ... *

వినియోగః.

శ్లో॥ విస్మయేయుజ్యతేతచ్చపరాభిప్రాయవేదనే॥

టీ॥ విస్మయమునందు- యితరులయొక్క-యభిప్రాయముదెలుసుకొనుటయందు- యీఆరాత్రికశిరస్సును-వినియోగింపవలయు

## సమశిరోలక్షణం.

శ్లో॥ స్వాభావికంసమంశీర్షంస్వభావాభినయేభవేత్॥

టీ॥ స్వాభావికంబైనశిరస్సు- సమశిరస్సుయనబడును- ...

### వినియోగః.

టీ॥ స్వభావసిద్ధంబైనవయమునందు- యీసమశిరస్సును - వినియోగింపవలయు.

## పార్శ్వాభిముఖశిరోలక్షణం.

శ్లో॥ పార్శ్వాభిముఖమన్వర్థంపార్శ్వస్థస్యావలోకనే॥

టీ॥ యథార్థంబగు- పార్శ్వమునకుయభిముఖంబైన - శిరస్సు- పార్శ్వాభిముఖశిరస్సుయనబడును.

### వినియోగః-

పార్శ్వములయందుండెడివస్తువులను- జూచుటయందు - యీపార్శ్వాభిముఖశిరస్సును- వినియోగింపవలయు-౫. ... ... *

## సౌమ్యశిరోలక్షణమ్.

శ్లో॥నిశ్చలంసమమాఖ్యాతంనృత్తారంభేప్రయుజ్యతే।

తా॥ నిశ్చలంబైనసమశిరస్సు- సౌమ్యశిరస్సుయనబడును.

### వినియోగః

నృత్తారంభకాలమునందు- యీసౌమ్యశిరసును వినియోగింపవలయు.

## ఆలోళితశిరోలక్షణం.

శ్లో॥ ఆసమంతాల్లోళితంయత్తదాలోళితమీరితం।

టీ॥ అంతటద్రిప్పబడినది యేశిరస్సో- యాశిరస్సు। ఆలోళితశిరస్సుయనబడును. ... ... ... ... ... ...

### వినియోగః.

శ్లో॥ పుష్పాంజలిక్రమేచారి నటనేలవణేతథా!
ఆలోళితస్యశిరసోవినియోగోవిధీయతే॥

టీ॥పుష్పాంజలినిచ్చేక్రమమునందు-చారినాట్యమునందు-లవణనాట్యమునందు- యీయాలోళితశిరస్సును- వినియోగింపవలయు



## తిరశ్చీనశిరోలక్షణం.

శ్లో॥ పార్శ్వద్వయోరూర్ధ్వభాగేచలనాత్తిర్యగీరితం।

టీ॥ వుభయపార్శ్వములయొక్క వూర్ధ్వభాగములయందు- యడ్డముగావలింపజేసుటవలన- తిరశ్చీనశిరస్సుయనబడును,

### వినియోగః.

శ్లో॥ లజ్జానిరూపణేనృత్తేముఖచాళీయనామని।
తత్తదాచిత్యకార్యేషుతిరశ్చీనముదీరితం॥

టీ॥లజ్జనునిరూపణజేసుటయందు-ముఖచాళీయమనెడినృత్తమునందు- ఆయాయుచితంబులైనకార్యంబులయందు- యీతిరశ్చీనశిరస్సును- వినియోగింపవలయు. ... ... ... ...*

## ప్రకంపితశిరోలక్షణం.

శ్లో॥ పునఃపునశ్చలనాత్పురోభాగేచపార్శ్వయోః॥
ప్రకంపితశిరఃప్రోక్తంనాట్యశాస్త్రేషుసమ్మతం।

టీ॥ పురోభాగమునందు- వుభయపార్శ్వములయందు - మాటిమాటికిని- చలింపజేసుటవలన-ప్రకంపితశిరస్సుయనబడును.

### వినియోగః.

శ్లో॥ అద్భుతాఖ్యరసేగీతేప్రబంధేభ్రమరేతథా॥
ప్రత్యర్థియుద్ధభావేపిప్రకంపితశిరోభవేత్॥

టీ॥ అద్భుతరసమునందును- గీతము- ప్రబంధము - మదులైనవాట్లయందును- భ్రమరీనాట్యమందును - శత్రురాజుల యొక్కయుద్ధమునందును-యీప్రకంపితశిరస్సును- వినియోగింపవలయు,

## సౌందరశిరోలక్షణమ్-

శ్లో॥ఊర్ధ్వాధోముఖవిన్యాసాత్పశ్చాద్భాగేచచాలనాత్।
సౌందర్యాఖ్యశిరఃప్రోక్తంసర్వనాట్యేప్రశస్యతే॥

టీ॥ పైకియెత్తబడ క్రిందవంచబడ్డ- పార్శ్వభాగమునందు-

ద్రిప్పబడ్డ- శిరస్సు- సౌందర శిరస్సనబడును- ... *

వినియోగః

శ్లో॥ కారణాభినయేహస్తభ్రమణాఖ్యేచనర్తనే।
సౌందరాఖ్యశిరఃప్రోక్తం యోగాభ్యాసేషుయుజ్యతే॥

టీ॥ కారణాభినయమునందు- హస్తభ్రమణనాట్యమునందు - యోగాభ్యాసమునందు - యీసౌందరాఖ్యశిరస్సును- వినియోగింపవలయు. ॥౪॥

అథదృష్టిభేదాః-

శ్లో॥ సమమాలోకితంసాచీ ప్రలోకితఃమీలితే।
ఉల్లోకితానువృత్తేచతథాచైవావలోకితం॥
ఇత్యష్టౌదృష్టిభేదాస్యుః కీర్తితోభరతాగమే।

టీ॥ సమదృష్టియనియును- ఆలోకితదృష్టియనియును- సాచీదృష్టియనియును - ప్రలోకితదృష్టియనియును - నిమీలితదృష్టియనియును- ఉల్లోకితదృష్టియనియును- అనువృత్తదృష్టియనియును- అవలోకితదృష్టియనియును- యనిమిదివిధంబులుగా - భరత శాస్త్రంబునందు- జెప్పబడియుండును. సమదృష్టిలక్షణమ్.

శ్లో॥ వీక్షితంసురనారీభిస్సమానంసమవీక్షణమ్।

టీ॥ దేవతాస్త్రీలతోడ- సమమగునట్లు- సమముగ జూడబడెడి జూపుసమదృష్టియనబడును-

వినియోగః

శ్లో॥ నాట్యారంభేతులాయాంచ అన్యచిన్తావినిశ్చయే।
ఆశ్చర్యే దేవ తారాపెసమదృష్టిరుదాహృతా॥

టీ॥ నాట్యారంభమందును త్రాసుయందును-యితరులచింతననిశ్చయించుటయందును- ఆశ్చర్యమునందును - దేవతులయొ [illegible] రూపమునందును- ఈసమదృష్టిని-వినియోగింపవలయు. ... *

ఆలోకితదృష్టిలక్షణమ్.

శ్లో॥ ఆలోకితంభవేదాశుభ్రమణంస్ఫుటవీక్షణం॥



ఖాండఖాండాంతరస్యాపియత్రసంధిర్నలభ్యతే॥
నర్తక్యాగతివైచిత్ర్యాద్భావఇత్యభిధీయతే॥

చారినృత్తలక్షణం.

శ్లో॥ కోమలంసవిలాసంచమధురంతాళతాన్వయా।
కరిణావిద్ధతన్మాదిత్రిశ్రుతాప్రచురంతథా॥
పాదోరుకటిబాహూనాంయోగపద్యేనచాలనం।
ఏకసంఖ్యాంసమారభ్యచతుష్షష్టిప్రపూర్తయే॥
అగణార్యపురఃపశ్చాద్ద్వాత్రింశతోష్షడశాష్టభిః॥
చతుర్భిశ్చతయోఃపశ్చాదంత్యధీచరణానిచ॥
కుర్యాత్తతస్తాళలయంచారీనృత్తమిదంవిదుః॥

అంగరేఖాలక్షణం

శ్లో॥ ఆస్థానదక్షిణేభాగేస్థిత్వాతత్రసభాపతిం।
వామేతరేణనేత్రేణసాదరంచావలోకయన్॥
ఆదౌతుసమపాదస్స్యాద్ధస్తచేత్తులతాకరః।
సమంశిరస్సమాదృష్టిరంగరేఖాభిధీయతే॥

సమనృత్తలక్షణమ్

శ్లో॥ సమనృత్తంతథారంభేచతుష్షష్టికరాన్వితం।
అష్టఖండలసంయుక్తమష్టదిక్ష్వపిచాష్టకం॥
ఆదితాళలయాభిజ్ఞానర్తనంసమనర్తనం।
లలితాఖ్యకరేణాపిబహిర్భ్రమణబంధనం॥
సమనృత్తమిదంముఖ్యంభరతాచార్యసమ్మతం॥

గతిలక్షణం.

శ్లో॥ హంసలావమయూరాశ్చఅతిలఃకుకుటస్తథా।
గజోవాతురగశ్చైవసప్తైతేగతిరీరితా॥

టీ॥ శీఘ్రముగ- భ్రమణముగలుగనట్లుస్ఫుటమగునట్లుజూచుట- ఆలోకితదృష్టియనబడును- ... ... *

వినియోగః,

శ్లో॥ కులాలచక్రభ్రమణే సర్వవస్తుప్రదర్శనే।
ఇచ్ఛాయాంచప్రయోక్తవ్య మాలోకితనిరీక్షణం॥

టీ॥ కులాలచక్రభ్రమణమునందును - సమస్తవస్తువులయొక్క- జూపుటయందును- ఇచ్ఛయందును- యీయాలోకితదృష్టిని - వినియోగింపవలయు. ... ... ... *

సాచిదృష్టిలక్షణమ్.

శ్లో॥ స్వస్థానేతిర్యగాకారమపాఙ్గచలనక్రమాత్।
సాచీదృష్టిరితిజ్ఞేయా నాట్యశాస్త్రార్థకోవిదైః॥

టీ॥ స్వస్థానమందునిలిచి- యడ్డముగ- అపాంగచలనక్రమమువలన- చలించినదృష్టి- సాచీదృష్టియనబడును. ... *

వినియోగః.

శ్లో॥ ఇంగితేక్ష్మశ్రుసంస్పర్శే శరలక్ష్యేంశుకేస్మృతా।
సూచనాయాంచకులటానాట్యేసాచీనిరీక్షణమ్॥

టీ॥ పరులయొక్క-యభిప్రాయమును - దెలుసుటయందును - మీసమునుదువ్వుటయందును- బాణముయొక్క-లక్ష్యమునందును - వస్త్రమునందును- తలంచుటయందును- సూచనజేసుటయందును- వ్యభిచారిణి - స్త్రీయొక్క-నటనయందును - యీ సాచీదృష్టినివినియోగింపవలయు. ... ... *

ప్రలోకితదృష్టిలక్షణమ్.

శ్లో॥ ప్రలోకితంపరిజ్ఞేయంచలనాత్పార్శ్వభాగయోః॥

టీ॥ ఉభయపార్శ్వములయందును- చలింపజేయుటవలన-ప్రలోకితదృష్టియనబడును. ... ... *

వినియోగః.

శ్లో॥ ఉభయోః పార్శ్వయోర్వస్తుదర్శనేచ ససంజ్ఞికే।
చలనే బుద్ధిజాడ్యే చ ప్రలోకితనిరీక్షణమ్॥

టీ॥ ఉభయపార్శ్వములయందుండెడి- వస్తువులను జూపుటయందును- సన్నజేసుటయందును- చలించుటయందును- బుద్ధియొక్క-జడతయందును- యీప్రలోకితదృష్టిని - వినియోగింపవలయు. *

నిమీలితదృష్టిలక్షణమ్.

శ్లో॥ దృష్టైరర్ధవికాసేన మీలితాదృష్టిరీరితా।

టీ॥ అర్ధవికసనము జేతమూయబడినదృష్టి - నిమీలితదృష్టి యనబడును. ... ... ... ... *

వినియోగః.

శ్లో॥ ఋషివేషే పరవశే జపే ధ్యానే నమస్కృతౌ।
ఉన్మాదే సూక్ష్మదృష్టౌ చ మీలితాదృష్టిరీరితా॥

టీ॥ ఋషివేషమునందును- పరవశుడై యుండుటయందును- జపము జేయుటయందును- నమస్కరించుటయందును- మదించియుండుటయందును - సూక్ష్మదృష్టియందును- యీనిమీలితదృష్టిని - వినియోగింపవలయు. ... ... ... ... ... *

ఉల్లోకితదృష్టిలక్షణమ్.

శ్లో॥ ఉల్లోకితమితిజ్ఞేయమూర్ధ్వభాగోన్నతానతం।

టీ॥ ఊర్ధ్వభాగమునందు ప్రసరింపజేసి - క్రిందత్రిప్పబడినదృష్టి- ఉల్లోకితదృష్టియనబడును. ... ... *

వినియోగః

శ్లో॥ ధ్వజాగ్రే గోపురే దేవమంటపే పూర్వజన్మని।
ఔన్నత్యే చంద్రికాదౌ చ ఉల్లోకితనిరీక్షణం॥

టీ॥ ధ్వజముయొక్క-అగ్రభాగమునందును - గోపురమునందును- దేవమంటపమునందును - పూర్వజన్మమునందును - ఔన్నత్యమునందును- చంద్రికమొదలగువాట్లయందును - యీఉల్లోకితదృష్టిని - వినియోగింపవలయు. ... ... *



అనువృత్తదృష్టిలక్షణం.

శ్లో॥ ఊర్ధ్వాధోవీక్షణం వేగాదనువృత్తనిరీక్షణం॥

టీ॥ శీఘ్రముగ- ఊర్ధ్వాధోభాగమునందు- జూచుచునుండెడి దృష్టియనువృత్తదృష్టియనబడును. ... *

వినియోగః-

శ్లో॥ కోపదృష్టౌ ప్రియాహ్వానే త్వనువృత్తనిరీక్షణం॥

టీ॥ కోపము జేజూచుటయందును- ప్రీతిచేబిలుచుటయందును- యీయనువృత్తదృష్టిని- వినియోగింపవలయు, ... *

అవలోకితదృష్టిలక్షణమ్.

శ్లో॥ అధస్తాద్దర్శనం యత్తదవలోకితముచ్యతే॥

టీ॥ క్రిందుజూచుచునుండెడిజూపు - యవలోకితదృష్టియనబడును. వినియోగః

శ్లో॥ ఛాయాలోకే విచారే చ శయ్యాయాం పఠనక్రమే।
స్వాంగావలోకనే యానేష్వవలోకితముచ్యతే॥

టీ॥ నీడనుజూచుటయందును- విచారమును జేసుటయందును - పాన్పుయందును- చదువుటయందును- తనయవయవములును-జూచుకొనుటయందును- యానమునందును. యీయవలోకితదృష్టిని - వినియోగింపవలయు. ... ... ... *

అథగ్రీవాభేదాః.

శ్లో॥ సుందరీ చ తిరశ్చీనా తథైవ పరివర్తితా।
ప్రకంపితా చ భావజ్ఞైర్జ్ఞేయా గ్రీవా చతుర్విధా॥

టీ॥ సుందరియనియును- తిరశ్చీనయనియును- పరివర్తితయని

యును- ప్రకంపితయనియును-గ్రీవాభేదంబులు- నాల్గువిధములుగ-
జెప్పబడియుండును. ... ... ... ... ... *

సుందరీగ్రీవాలక్షణమ్.

శ్లో॥ తిర్యక్ప్రచలితాగ్రీవా సుందరీతినిగద్యతే॥

టీ॥ అడ్డముగ- చలింపజేయబడినది- సుందరీగ్రీవమనబడును.

వినియోగః.

శ్లో॥ స్నేహారంభేతథాయత్నే సమ్యగర్థేపిచ స్మృతా।
సరసత్వేనుమోదేచ సాగ్రీవాసుందరీమతా॥

టీ॥ స్నేహారంభమునందును - యత్నముజేయుటయందును -
ఒంచిదియనుటయందును- తలచుటయందును - సరసమునందును-
అనుమోదమునందును-యీసుందరీగ్రీవమును-వినియోగింపవలయు

తిర్యక్చీనాగ్రీవాలక్షణమ్.

శ్లో॥ పార్శ్వద్వయోర్ధ్వభాగేతుచలనాత్సర్పయానవత్।
సాగ్రీవాతుతిరశ్చీనేత్యుచ్యతేనాట్యకోవిదైః॥

టీ॥ పార్శ్వద్వయము యొక్క-ఊర్ధ్వభాగములయందు- సర్ప
గమనమువలన-చలింపజేయబడినకంఠము-తిరశ్చీనగ్రీవమనబడును.

వినియోగః-

శ్లో॥ ఖడ్గభ్రమేసర్పగత్యాం తిరశ్చీనానిగద్యతే।

టీ॥ కత్తిత్రిప్పుటయందును- సర్పగమనమునందును- యీతి
రశ్చీనగ్రీవమును- వినియోగింపవలయు. ... *

పరివర్తితగ్రీవాలక్షణమ్.

శ్లో॥ సవ్యాపసవ్యచలితా గ్రీవాయత్రార్ధచంద్రవత్।
సాతునాట్యకలాభిజ్ఞైస్సంప్రోక్తాపరివర్తితా॥

టీ॥అర్ధచంద్రునిబోల్పన- సవ్యాపసవ్యముగ- చలింపజేయ
బడినదియెదియో- అదియుపరివర్తితగ్రీవమనబడును. ... *



వినియోగః

శ్లో॥ శృంగారనటనేకాంతాకపోలపరిచుంబనే।
నాట్యతంత్రవిశేషజ్ఞైస్సంప్రోక్తాపరివర్తితా॥

టీ॥శృంగారనటనమునందును - ప్రియురాలుయొక్క-కపోలచుం
బనమునందును యీపరివర్తితగ్రీవమును- వినియోగింపవలయు.

ప్రకంపితగ్రీవాలక్షణం

శ్లో॥ పురఃపశ్చాత్ప్రచలనాత్కపోతీకంఠకంపవత్।
ప్రకంపితేతిసాగ్రీవాప్రోక్తానాట్యవిశారదైః॥

టీ॥ ఆడకపోతపక్షియొక్క- కంఠకంపనము బోల్పన - ముందు
వెనకగ - చలింపజేయబడినదియదియో - అదియు - ప్రకంపితగ్రీ
వమనబడును. వినియోగః.

శ్లో॥ యుష్మదస్మదితిప్రోక్తౌ దేశీనాట్యవిశేషకే।
డోలాయాంగణితేచాపిప్రయోక్తవ్యాప్రకంపితా॥

టీ॥ నీవు- నేను - యనిజెప్పుటయందును - దేశీనాట్యమునందు
ను- ఉయ్యాలయందును- లెఖ్ఖబెట్టుటయందును - యీప్రకంపితగ్రీ
వమునువినియోగింపవలయు. ... ... *

అథవక్షోభేదాః.

శ్లో॥ సమమాభుగ్ననిర్భుగ్నకంపితోద్వాహితేపరే।
ఇతిపంచవిధంవక్షఃప్రోచ్యతేశంభునిర్మితం॥

టీ॥ సమమనియు- ఆభుగ్నమనియు- నిర్భుగ్నమనియు - కంపి
తమనియు- ఉద్వాహితమనియు- వక్షస్సుమైదువిధంబులుగ- ప
రమేశ్వరునిచేనిర్మితంబై - యుండును. ... ... *

సమవక్షోలక్షణమ్.

శ్లో॥ సమ్యగాధిష్ఠితంవక్షఃచతురంచాంగసంశ్రయం।
ప్రకృతిస్థంసమంప్రాహుస్స్వభావాభినయేచతత్॥

టీ॥ చక్కఁగా! మనోహరంబుగ- ఉపాంగములు నాశ్రయించి యుండెడి - ప్రకృతిస్థంబై యుండెడి- వక్షస్సు- సమవక్షస్సనబడును. యీవక్షస్సు స్వభావాభినయమునందు వర్ణించును.

ఆభుగ్నవక్షోలక్షణం.

శ్లో॥ నిమ్నం శిథిలమాభుగ్నం వక్షః స్యాద్గర్వలజ్జయోః।
శీతవ్యాచ్ఛల్యయోశ్శోకే మూర్ఛాయాం సంభ్రమేపిచ॥

టీ॥ నిమ్నమగునట్లు- వంచబడిన - వక్షస్సు - ఆభుగ్నవక్షస్సనబడును. యీ ఆభుగ్నవక్షస్సు- గర్వమునందును - లజ్జయందును- చలియందును- వ్యాచ్ఛల్యరోగమునందును- మూర్ఛయందును సంభ్రమణమునందును వర్ణించును. ... ... ... ...

నిర్భుగ్నవక్షోలక్షణం.

శ్లో॥ నిర్భుగ్నం నిమ్నపృష్ఠం చేత్కృతం స్తబ్ధమురస్తథా।
మానేచ సత్యవచనే స్తంభే విస్మయవీక్షణే॥
ప్రహర్షభాషణే గర్వోత్సేధేచైవ ప్రయుజ్యతే।

టీ॥ నిమ్నపృష్ఠము గలుగునట్లు- వక్షస్సు- నిశ్చలమగునట్టు- జేయబడినదైతే - నిర్భుగ్నవక్షస్సు యనబడును. యీనిర్భుగ్నవక్షస్సు- గర్వమునందును- సత్యమగు ప్రతిజ్ఞావచనమునందును- స్తంభమునందును - ఆశ్చర్యమును జూపుటయందును - సంతోషభాషణమునందును- గర్వాధిక్యమునందును- వర్ణించును. ... ...

కంపితవక్షోలక్షణం.

శ్లో॥ ప్రకంపితం కంపితం చేదూర్ధ్వక్షేపైర్నిరంతరైః।
స్యాద్విహాస్యశ్రమశ్వాసఖాసహిక్కాసురోదనే॥

టీ॥ యెడలేకుండుండెడి- ఊర్ధ్వక్షేపములు జేతకంపింపజేయబడిన వక్షస్సు- ప్రకంపితవక్షస్సు యనబడును. యీప్రకంపితవక్షస్సు విశేషహాసమునందును - శ్రమయందును - శ్వాసఖాసుల



యందును- హిక్కయందును- రోదనమునందును - వర్ణించును.

ఉద్వాహితవక్షోలక్షణం.

శ్లో॥ సకృత్తగళముత్క్షిప్తం కించిత్కంపనసంయుతం।
ఉద్వాహితం తదుత్తుంగాలోకనే స్యాద్విజృంభణే॥
ఊర్ధ్వచ్ఛ్వాసవిజృంభాయామభినేయమిదీరితం॥

టీ॥ సకృత్ చ్ఛలనమగునట్టు పైకియెత్తబడి- స్వల్పకంపనము దోడ- గూడుకొనుండెడి వక్షస్సు- ఉద్వాహితవక్షస్సనబడునో-ఆ ఉద్వాహితవక్షస్సు- పైనయుండెడి- వస్తువును - జూచుటయందును - విజృంభణమునందును - ఊర్ధ్వశ్వాసముయొక్క - జృంభణమునందును- వర్ణించును. ... ... ... ... *

అథ పార్శ్వభేదాః.

శ్లో॥ వివర్తితం చాపసృతం ప్రసారితమథోన్నతం।
ఉన్నతం చేతిచ ప్రాహుః పార్శ్వం పంచవిధం బుధాః॥

టీ॥ వివర్తితమనియు- అపసృతమనియు - ప్రసారితమనియు- అధోన్నతమనియు- ఉన్నతమనియు-పార్శ్వంబులను- యైదువిధంబులుగ- విద్వాంసులు జెప్పుదురు. ... ... ... *

వివర్తితపార్శ్వలక్షణం.

శ్లో॥ వివర్తనాత్త్రికస్యస్యాత్పరావృత్తా వివర్తితం।

టీ॥ పృష్ఠవంశాధర ప్రదేశముయొక్క-తిరుగుటవలన- పార్శ్వము- వివర్తితమనబడును. యిది తిరిగిజూచుటయందు వర్ణించును.

అపసృతపార్శ్వలక్షణం.

శ్లో॥ తత్సన్నిపాతాపసృతం భవేత్పార్శ్వస్థదర్శనే॥

టీ॥ పార్శ్వముచక్కఁగ- త్రిప్పుటవలన- అపసృతపార్శ్వము నపించుకొనును యీపార్శ్వము - పార్శ్వమునందుండెడి వానియొక్క- జూచుటయందు వర్ణించును. ... ... ... *

ప్రసారితపార్శ్వలక్షణం

శ్లో॥ ప్రసారితంచోభయతోవిస్తృతం స్యాన్ముదాదిషు।

టీ॥ ఉభయపార్శ్వములయందును-విస్తృతంబైనది - ప్రసారితపార్శ్వమనబడును - ఇది - సంతోషముమదులగువాట్లయందు-వర్తించును- అథోన్నతపార్శ్వలక్షణం.

శ్లో॥ ఏకత్రాత్యున్నతంచాథోన్నతంస్యాదుపసర్పణే॥

టీ॥ వకదిక్కున- అత్యంతోన్నతమగు- పార్శ్వము-అథోన్నతపార్శ్వమనబడును. ఇది చేరికకుపోవుటయందువర్తించును.

ఉన్నతపార్శ్వలక్షణం.

శ్లో॥ పార్శ్వంతద్విపరీతంతూన్నతంస్యాదుపసర్పణే॥

టీ॥ తద్విపరీతమగు- పార్శ్వము - ఉన్నతపార్శ్వమనబడును- యిది- లేచితిరిగివచ్చుటయందువర్తించును- ... ...*

అథకటిభేదాః.

శ్లో॥ కంపితోద్వాహితాచిన్నావివృత్తారేచితాతథా।

కటిఃపంచవిధేత్యుక్తాతల్లక్ష్మపోచ్యతేధునా॥

టీ॥ కంపితమనియును- ఉద్వాహితమనియును- చిన్నయనియును- వివృత్తయనియును- రేచితయనియును- కటి- యైదు విధంబులుగయుండును- కంపితకటిలక్షణమ్

శ్లో॥ ద్రుతంగతాగతేపార్శ్వేదధతీకంపితాత్మకాం।

తాంకుబ్జవామనాదీనాంగమనేతునియుజ్యతే॥

టీ॥ శీఘ్రముగ- గమనాగమనములయందు- ఉభయపార్శ్వంబులయందు. చలనాత్మక భావమును- ధరిస్తునుండెడికటి - కంపితకటియనుపించుకొనును. వినియోగః

టీ॥ గూనుగలవాడు - పొట్టివాడు మదులగు వారులయందు- యీకంపితకటినివినియోగింపవలయు. ... ... ... *



ఉద్వాహితకటిలక్షణం.

శ్లో॥ శనైరుచ్చలితాపార్శ్వద్వయేనోద్వాహితాకటిః।

టీ॥ పార్శ్వద్వయముజేత- మెల్లమెల్లగ - ఉచ్చలితంబగు- కటిఉద్వాహితకటియనుపించుకొనును- ... ...

వినియోగః.

శ్లో॥ విలాసగమనేచైవస్థూలాంగగమనేపిచ।

ఉద్వాహితకటిశ్చేయం యుజ్యతేభరతాదిభిః॥

టీ॥ విలాసగమనమునందును- స్థూలదేహముగలవానియొక్క- గమనమందును- యీఉద్వాహితకటినివినియోగింపవలయు.

చిన్నాకటిలక్షణం

శ్లో॥ చిన్నాతిర్యఙ్ముఖేపాత్రేమధ్యస్యవలనాత్కటిః।

టీ॥ పాత్ర- తిర్యఙ్ముఖముగుచునుండగను - మధ్యముయొక్క- చలనమువలన చిన్నాకటియనుపించుకొనును, వినియోగః.

శ్లో॥ వ్యాయామేసంభ్రమేచైషావ్యావృత్యప్రేక్షణాదిషు।

టీ॥ విస్తారమునందును- తిరుగుటయందును- వెనకతిరిగి - జూచుటయందును- యీచిన్నాకటినివినియోగింపవలయు.

వివృత్తాకటిలక్షణం

శ్లో॥ పరాఙ్ముఖేనపాత్రేణాభిముఖంయావివర్తితా।

వివృత్తాసాకటిఃప్రోక్తావినియోజ్యావివర్తనే॥

టీ॥ పరాఙ్ముఖమగు- పాత్రజేత- అభిముఖముగ - త్రిప్పబడినకటియదియొ- యీకటి- వివృత్తకటి- యనుపించుకొనును-ఆవివృత్తకటి- తిరుగుటయందువర్తించును. ... ... ... *

రేచితకటిలక్షణం.

శ్లో॥ సర్వతోభ్రమణాదుక్తారేచితాభ్రమణేభవేత్॥

టీ॥ అంతటతిరుగుటవలన- రేచితకటియనుపించుకొనును-యీ రేచితకటిభ్రమణమునందువర్తించును.

అథ పాదభేదాః

శ్లో॥ సమాంచితౌకుంచితశ్చసూచ్యగ్రతలసంచరా।
ఉద్ఘట్టితశ్చేతితథాషట్పాదాఃకీర్తితాబుధైః॥

టీ॥ సమమనిన్ని- అంచితమనిన్ని - కుంచితమనిన్ని- సూచీయనిన్ని - అగ్రతలసంచరమనిన్ని- ఉద్ఘట్టితమనిన్ని - పాదంబులు- ఆరుభేదంబులుగ- జెప్పబడియుండును- ... ... ... *

సమపాదలక్షణం

శ్లో॥స్వభావేనస్థితఃపాదస్సమయిత్యభిధీయ్యతే।
స్వభావాభినయేతస్యవినియోగోభిధియ్యతే॥

టీ॥ భూమియందు సమముగ - నిలిపినపాదము - సమపాదమనుపించుకొనును. యీపాదముస్వభావాభినయమునందువర్తించును-

అంచితపాదలక్షణం

శ్లో॥ అంగుళీఃకించిదాకుంచ్యపార్ష్ణినాభూమిసంస్థితః।
అంగుష్ఠమూర్ధ్వమున్నీయ్యాసపాదోంచితసంజ్ఞికః॥
వినియోగోభవేత్తస్యవ్యతిభ్రమరకాదిషు॥

టీ॥మిడిమను-భూమియందునునిచి - అంగుళీలనుకొంచముగునట్లువంచి- అంగుష్ఠమును - ఊర్ధ్వముగ - యత్తబడినది. అంచితపాదమనుపించుకొనును - యీపాదము- అతిభ్రమరకాదులయందువర్తించును. ... ... ... ... ... *

అంగములు

శ్లో॥ అంగాన్యత్రశిరోహస్తౌకక్షౌపార్శ్వౌకటీతటా।
పాదావితిషడుక్తానిగ్రీవామప్యపరేజగుః॥



టీ॥ ఆంగికాభినయమునందు - శిరస్సు- హస్తంబులు - కక్షంబులు- పార్శ్వంబులు- కటిప్రదేశంబులు- పాదములు- యీయారు- అభినయాంగములని జెపుదురు - మరికొందరు కంఠమున్ను - అభినయాంగమని జెప్పుదురు ... ... ... ... ... ...

ప్రత్యంగములు

శ్లో॥ ప్రత్యంగానిత్వథస్కంధౌ బాహూపృష్ఠంతథోదరం।
ఊరూజంఘేషడిత్యాహురపరేమణిబంధకౌ॥
జానునీకూర్పరఇతిత్రయమప్యధికంజగుః॥

టీ॥ భుజశిరస్సులు- బాహువులు. పృష్ఠంబు. వుదరంబు-తొడలు- మోకాళ్ళు యీయారున్ను- ప్రత్యంగములని జెప్పుదురు-మరియు- గొందరు- మణికట్లు- జానూలు- మోచేతులు - యివిమూడున్ను- జేర్చి యంగములును- ప్రత్యంగములనిజెపుదురు.

ఉపాంగములు

శ్లో॥ దృష్టితత్పుటభ్రూతారాఃకపోలౌనాసికాహనూ।
అధరోదశనాజిహ్వాచుబుకంవదనంతథా॥
ఉపాంగానిద్వాదశైతేశిరస్యంగానివైతథా।
పార్ష్ణిగుల్ఫౌతథాంగుళ్యఃకరయోఃపదయోస్తలే॥
ఏతానిపూర్వశాస్త్రానుసారేణోక్తానివైమయా।

టీ॥ దృష్టులు- రెప్పపాట్లు- కన్నుబొమ్మలు- కంటిగుడ్లు - చెక్కిళ్ళు- ముక్కుదవడలు- అధరము- దంతంబులు - నాలుక - చుబుకము- ముఖము- యీపదిరెండు- శిరస్సుయందునుండెడు ఉపాంగంబులు- అదేప్రకారంబుగానె- కరంబులయందును - పాదంబులయందును- మిడిమిలు- గుల్ఫంబులు- అంగుళలు- తలములు-యివిహస్తపాదోపాంగబులనిజెప్పబడియుండును. ... ... *

శ్లో॥ అంగానాంచలనాదేవప్రత్యంగోపాంగయోరపి।
చలనంప్రథమేతత్తస్మాత్సర్వేషాంనాత్రలక్షణం॥

టీ॥ శిరోహస్తకరాదిముఖ్యాంగములయొక్క-చలించుటచేత-ప్రత్యం
గోపాంగములయొక్క-చలనముగలుగును- గావుననుపాంగప్రత్యం
గములకు- లక్షణంబులుప్రత్యేకప్రత్యేకంబుగ-జెప్పబడలేదు.

నాట్యద్వాదశాంగలక్షణం

శ్లో॥ పీఠికంప్రథమంతేషాంద్వితీయ్యంకౌతమేవచ।
తృతీయ్యంకూటమానంచచతుర్థంకైయ్యడుస్తథా॥
పంచమంతురుపుఃప్రోక్తంషష్ఠంచతుకళాసికా।
సప్తమంప్రచురంచైవఅష్టమంవసరంతథా॥
నవమంశబ్దకశ్చైవదశమంతుమరాళకం।
రుద్రంకడకటుశ్చైవచాళీయ్యంద్వాదశంతథా॥
నాట్యేషుద్వాదశాంగానిప్రయోక్తవ్యానిసూరిభిః॥

టీ॥ నాట్యద్వాదశాంగంబులయందు - మదటియంగము- పీఠ
కమనియు- ద్వితీయాంగము- కౌతమనియు-తృతీయ్యాంగము - కూ
టమానమనియు- తురీయాంగము- కైయ్యడుయనియు-పంచమాం
గము- తురుపుయనియు- షష్ఠాంగంబు- కళాసికాయనియు- సప్త
మాంగము- ప్రచురమనియు - అష్టమాంగము - వసరమనియు - న
వమాంగము- శబ్దకమనియు- దశమాంగముమరాళమనియు- ఏకా.
దశాంగము - కడకటుయనియు- ద్వాదశాంగము - చాళీయ్యమని
యు- యీజెప్పిన- నాట్యద్వాదశాంగంబులు- క్రమంబుగా - నా
మంబులను- బొందియుండును - నాట్యంబులయందు - యీద్వా
దశాంగంబులు- నాట్యశాస్త్రంతెలిశినవారిచే తెలియవలయు.



పీఠకలక్షణం.

శ్లో॥ తథాతకారేణసంయుక్తస్తాదిగిద్దిగిరేవచ।
ఆదౌతుసమపాదశ్చహస్తశ్చతులతాభిదః॥
సమంశిరస్సమాదృష్టిఃపీఠకంచాభిధీయ్యతే॥

కౌకలక్షణం.

శ్లో॥ పాతాక్షరేణసంయుక్తందేవతావిషయాత్మకం।
నానార్థచిత్రసంయుక్తంకిత్తాంతంకౌతముచ్యతే॥

కూటమానలక్షణమ్

శ్లో॥ధిరక్తకతకంచాదాధీగుణాంగంతుమధ్యమే।
కూటమానమిదంప్రోక్తంపాతాక్షరవిచక్షణైః॥

కైయ్యడులక్షణం.

శ్లో॥కైయ్యడ్వాధీస్తుతకత్తోధికత్తోధిగతేధిచ।
శిరోభేదసమాయుక్తదృష్టిస్థానకసంయుతః॥
నృత్తహస్తానుగామీచపాదచార్యస్తుకైయ్యడుః।

తురుప్రలక్షణం

శ్లో॥తత్తాధిత్తాదిపూర్వంతుదందందింద్యాధిమధ్యమె।
ఏవంపాతాక్షరంయత్రసనామ్నాతురుపుర్భవేత్॥

కళాసికాలక్షణం

శ్లో॥ఝుంకారాదిస్వరైశ్లిష్టందీర్ఘకైర్వాక్షరైర్యుతం।
ప్రాయేణదృశ్యతేయత్రకీర్తితాసాకళాసికా॥

ప్రచురలక్షణం

శ్లో॥ తాహఝుంతరితశబ్దశ్చకుందరితమేవచ॥
ఏతచ్ఛబ్దసమాయుక్తంప్రచురంనామకీర్తితం॥

For p.383 see p.368

వసగలక్షణం

శ్లో॥ఝుంతద్వయాక్షరాస్స్యాదాధణకుద్ధణమధ్యమే।
ఇదంతువసరంనామప్రోచ్యతేపూర్వసూరిభిః॥

శబ్దలక్షణమ్

శ్లో॥ఏభిర్వర్ణైస్సమైర్హస్తైశ్శ్లిష్టవాద్యత్రనిర్మితః!
తద్ధంగణాదిశబ్దాంతేసశబ్దఃపరికీర్తితః॥

మరాళలక్షణం

శ్లో॥ ప్రథమందుగ్గదిగ్గిస్స్యాదంతేధోంగుడుధాంగుడుః।
ధీంతకిటధణంమధ్యేమరాళస్తుప్రకీర్తితః॥

కడకటులక్షణమ్

శ్లో॥ ప్రాయేణశ్లిష్టవర్ణశ్చదీందకాదిసమన్వితః।
ఆదిమధ్యావసానేషుతవర్ణంతేచబంధకః॥

చాళీయ్యలక్షణం

శ్లో॥ రేఖానుమానగాంభీర్యంతత్రతాళలయాన్వితం।
ఉరోకటిశిరోపాంగంకోమలంయదిచాలయేత్॥
అర్ధచ్చాళీయకశ్చాథచాళీహస్తయుతోయది॥

చారమానలక్షణమ్

శ్లో॥స్వరసంశ్లిష్టసంపూర్ణంధాంధాంవర్ణకృతోభవేత్॥
ఆదిమధ్యావసానేషు చారమానోభిధీయతే॥

నత్రలక్షణం

శ్లో॥తాద్ధిమిద్ధిమివర్ణంతుతద్ధిక్కిటమేవవ।
నామ్నాతునత్రమిత్యేవముచ్యతేపూర్వసూరిభిః॥

నృత్తభావలక్షణం

శ్లో॥ తాళతాళాంతరస్యాపివాద్యవాద్యాంతరస్యచ।

ద్రిప్పబడ్డ- శిరస్సు- సౌందరశిరస్సుయనబడును- ... ❋

వినియోగః

శ్లో॥ కారణాభినయేహస్తభ్రమణాఖ్యేచనర్తనే।
సౌందరాఖ్యశిరఃప్రోక్తం యోగాభ్యాసేషుయుజ్యతే॥

టీ॥ కారణాభినయమునందు- హస్తభ్రమణనాట్యమునందు - యోగాభ్యాసమునందు - యీసౌందరాఖ్యశిరస్సును- వినియోగింపవలయు. ॥౯॥

అథదృష్టిభేదాః-

శ్లో॥ సమమాలోకితంసాచీ ప్రలోకితనిమీలితే।
ఉల్లోకితానువృత్తేచతథాచైవావలోకితం॥
ఇత్యష్టౌదృష్టిభేదాస్యుఃకీర్తితోభరతాగమే।

టీ॥ సమదృష్టియనియును- ఆలోకితదృష్టియనియును- సాచీదృష్టియనియును - ప్రలోకితదృష్టియనియును - నిమీలితదృష్టియనియును- ఉల్లోకితదృష్టియనియును- అనువృత్తదృష్టియనియును- అవలోకితదృష్టియనియును- యనిమిదివిధంబులుగా - భరత శాస్త్రంబునందు- జెప్పబడియుండును. సమదృష్టిలక్షణమ్.

శ్లో॥ వీక్షితంసురనారీభిస్సమానంసమవీక్షణమ్।

టీ॥ దేవతాస్త్రీలతోడ- సమమగునట్లు- సమముగ జూడబడెడి జూపుసమదృష్టియనబడును-

వినియోగః

శ్లో॥ నాట్యారంభేతులాయాంచఅన్యచిన్తావినిశ్చయే।
ఆశ్చర్యే దేవతారూపేసమదృష్టిరుదాహృతా॥

టీ॥ నాట్యారంభమందును త్రాసుయందును-యితరులచింతననిశ్చయించుటయందును- ఆశ్చర్యమునందును - దేవతులయొక్క రూపమునందును- ఈసమదృష్టిని- వినియోగింపవలయు. ... ❋

ఆలోకితదృష్టిలక్షణమ్.

శ్లో॥ ఆలోకితంభవేదాశుభ్రమణంస్ఫుటవీక్షణం॥



ఖండఖండాంతరస్యాపియత్రసంధిర్నలభ్యతే॥
నర్తక్యాగతివైచిత్ర్యాద్భావఇత్యభిధీయతే॥

చారినృత్తలక్షణం.

శ్లో॥ కోమలంసవిలాసంచమధురంతాళతామ్యయా।
కరణావిద్ధతన్నాదిత్రిశుతాప్రచురంతథా॥
పాదోరుకటిబాహూనాంయోగపద్యేనచాలనం।
ఏకసంఖ్యాంసమారభ్యచతుష్షష్టిప్రపూర్తయే॥
అగణార్యపురఃపశ్చాద్ద్వాత్రింశతోష్షడశాష్టభిః॥
చతుర్భిశ్చతయోఃపశ్చాదంత్యధీచరణానిచ॥
కుర్యాత్తతస్తాళలయంచారీనృత్తమిదంవిదుః॥

అంగరేఖాలక్షణం

శ్లో॥ ఆస్థానదక్షిణేభాగేస్థిత్వాతత్రసభాపతిం।
వామేతరేణనేత్రేణసాదరంచావలోకయన్॥
ఆదౌతుసమపాదస్స్యాద్ధస్తచేత్తులతాకరః।
సమంశిరస్సమాదృష్టిరంగరేఖాభిధీయతే॥

సమనృత్తలక్షణమ్

శ్లో॥ సమనృత్తంతథారంభేచతుష్షష్టికరాన్వితం।
అష్టమండలసంయుక్తమష్టదిక్ష్వపిచాష్టకం॥
ఆదితాళలయాభిజ్ఞానర్తనంసమనర్తనం।
లలితాఖ్యకరణాపిబహిర్భ్రమణబంధనం॥
సమనృత్తమిదంముఖ్యంభరతాచార్యసమ్మతం॥

గతిలక్షణం.

శ్లో॥ హంసలావమయూరాశ్చఅతిలఃకుకుటస్తథా।
గజోవాతురగశ్చైవసప్తైతేగతిరీరితా॥

ఘేరణీలక్షణం.

శ్లో॥ ఘర్ఘరో విషమంభావత్రయశ్చకవివారకః।
గీతంచేతిసముద్దిష్టంపంచాంగానివిదుర్బుధాః॥

ఘేరణీఅడుగులలక్షణం.

శ్లో॥ పటవాటశ్చపటవఃశిరిపట్యోలగాదిరుః।
పాతాశిరిభిధాఖ్యశ్చతతఃఖలుహలాభిదః॥

మండలలక్షణమ్

శ్లో॥ తిర్యఙ్ముఖావచరణావేకతాళాంతరంతతః।
తాళస్సంస్పృష్టధరణౌవ్యోమ్నిజానుసమాకటిః॥
సమంశిరస్సమాదృష్టిజానూపృష్ఠతళౌకరా॥
వక్షస్సమంసమాస్కంధాయత్రతన్మండలంమతం।
ఇంద్రాదిదైవతంప్రోక్తంమునిభిర్భరతాదిభిః॥
కశ్యపాదిమునీంద్రాస్తుచతుస్తాళాంతరంజగుః।

భరతకల్పలతామంజరీ సంపూర్ణము.



శ్రీకృష్ణార్పణమస్తు.